# ... చరిత్రము.

గ్రంథకర్త:

... బద్దిరెడ్డి కోటీశ్వర్రావుగారు.

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు:—సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1937

 [వెల రు 0—8—0.

వి

# మహాకవి
# కాళిదాసచరిత్రము.

## కాళిదాసుని జన్మవృత్తాంతము.

తొల్లి కళింగదేశమున గొప్పతపోవన మొకటి గలదు. అది సమస్త ఫలపుష్పభరితంబై, తపోనిష్ఠాగరిష్ఠుల కునికిపట్టయి మునిజనాకర్షణీయముగ నొప్పుచుండెను. అట్టియాశ్రమంబున జిరంతపుఁడను మహామునీశ్వరుఁ డొకఁడు చిరకాలము నుండి తపస్సు జేయుచుండెను. అతఁడు కొంతకాలము వాయుభక్షణము చేసెను; మఱికొంతకాలము జలభక్షణము చేసెను; మఱికొంతకాలము కందమూలాకులు దినుచును; మఱికొంతకాలము నిరాహారుఁడుగను మహాఘోరముగ తపంబు గావించుచుండెను. వానితపోవేడిమిచే దిక్పాలకులు దల్లడిల్లిరి. ముల్లోకములు గంపించిపోవుచుండెను. వానితపోమహిమచేఁ దనయింద్రత్వ మెక్కడ దూరమగునో యని నిట్టూర్పు బుచ్చుచుండెను. అంత ముప్పదిమూఁడుకోట్ల దేవతలు నింద్రుని సమీపించి యెటులయిన వానితపంబు భంగంబు జేయు నుపాయ మ్మూహింపు మని విన్నవించుకొనిరి.

అంతట దేవేంద్రుఁడు రంభోర్వశీకాంతల రావించి "సుందరులారా! భూలోకంబున కళింగదేశమందు చిరంతపుఁ డను వాఁడు మహోగ్రమైన తపము జేయుచున్నాఁడు. వాని దారుణతపముచే దిక్పాలకులను నన్నుఁ గూడ పదభ్రష్టులఁ గావింపనున్నవాఁడు. కావున మీరీక్షణ మచ్చోటకుఁ బోయి, మీగానవిద్యానైపుణ్యమున, నిష్ఠాగరిష్ఠత్వమునుండి వానిని మేలుకొలిపి; మీయపురూపలావణ్యములచే వానిని దిగ్భ్రమఁ గావించి; మీశృంగారహావభావచేష్టలచే వానిమనస్థైర్యమును వికలము గావించి; వాలుతూపులఁబోలు మీచూపులచే మదనకదనరంగమునకు

వాని నీడ్చుకొని పోయి, నిరంతరనాకలోలునిఁ గావించి రం"డని యాన తిచ్చెను. వారాంగనలు సమ్మతించి భూలోకంబునకుఁ బోయిరి.

మూర్తీభవించిన బ్రహ్మతేజమో యనునట్లు వెలుంగుచున్న చిరంతపుని దేవకన్నియలు జూచి, వానితపోగ్రజ్వాలలచే, భస్మీభూతుల మగుదుమేమో యని, భయసంభ్రమములచేత నించుక వెనుకంజ వేసి, నెట్టకేలకు ధైర్యము దెచ్చుకొని, మెల్లమెల్లగా నాతనియొద్దఁ జేరి, వానికి ఫలపుష్పాదులు దెచ్చియిచ్చుచు, నాశ్రమము బరిశుభ్రముగ నూడ్చుచు, నారబట్ట లుదికి యారవైచుచు నెన్నియో తెఱంగుల వానికిఁ గొంతకాలముదనుక శుశ్రూష జేయుచుండిరి. క్రమంబుగ నాతఁడు వారలతోఁ జనువుగ మాటలాడుటయుఁ, దత్సమయానుకూలముగ నప్సరాంగనలు రాళ్లరగించుగానము సేయుచు, నవ్వుచుఁ గేరుచు వాలుజూపులఁ బ్రసారంబున విభ్రమముఁ గొలుపుచు, కరస్పర్శమున మోహవివశునిఁ గావింపుచు, నెట్టకేలకు వానినిఁ దమయొడిలో వైచుకొనిరి. నాటినుండియు, నతం డాతపోనిష్ఠనంతయుఁ దన్వంగులముఖారవిందముల నిల్పి, హోమాగ్నినుండి కామాగ్ని కుఱికి, యోగంబు రాగంబుఁ జేసి, బ్రహ్మధ్యానమును, పణ్యాంగనల రూపలావణ్యాదుల ధ్యానమున కప్పగించి, పర్ణకుటీరము పచ్చవిల్తునికుటీరముగ మార్చి, నిరంతరస్త్రీలోలుఁడై, కామినీలోకసమ్మోహనాస్త్రంబునఁ బరలోకంబు మఱచి, దేవాంగనలతోడిదే లోకమని నమ్మి స్వేచ్ఛగా విహరించుచుండెను.

అంతఁ గొన్నాళ్ళకు దేవమహర్షులు చిరంతపుని యుగ్రతపంబునఁ జూడఁదలఁచి యాతపోవనంబున కరుదెంచిరి. కాని, వాని తపోవ్యాపారమంతయుఁ గామవ్యాపారములయందు లీన మొనరించి యుండుటఁ జూచి యచ్చెరువొంది, 'చిరంతపా! తుచ్ఛమగుకామాగ్నిఁ జొచ్చి, తపోభాగ్యమెల్ల భస్మీపటలము గావించుట నీయట్టివానికిఁ దగదుసుమా!' యని యించుక మందలించిరి. చిరంతపుఁ డప్పు డజ్ఞానావస్థలో నుండు

టచే, మహామునులమాటలుఁ బాటిసేయక నెకసక్కెములాడి దూల నాడెను. వానితిరస్కారవచనములకు మునులు కోపస్ఫూర్తిమానసులై "దుర్మదాంధా! మునిజనవిరుద్ధముగ సదాచారము పానుల సరస సల్లాపములపాలు గావించి, కామాంధుఁడవై మమ్ముఁ దూలనాడితివి గావున, నీ వుత్తరజన్మంబున నొకకిరాతుఁడవై యుండువు గాక." అని శపించిరి. మునుల శాపాక్షరములు వినినతోడనే చిరంతపుఁడు గడగడ వడకుచుఁ బశ్చాత్తాపచిత్తుఁడై, నాయపరాధము క్షమింపుఁడని వారి పాదంబులు బట్టుకొని దీనాననుఁడై వేడుకొనెను. సదయహృదయులగు మునీశ్వరులు, వానిం జూచి "ఓయీ! ఇచ్చినశాపము గ్రమ్మరింప నెవ రితరము గాదు. కాని, కొంతమార్పు జేసెదము. నీవు మొదట బ్రాహ్మణకులమునఁ బుట్టియు, విద్యాగంధములేక కిరాతుఁడవై యుండెదవు. అనంతరము కాళీవరప్రసాదంబున లోకోత్తరపురుషుండ వయ్యెదవు." అని పలికి తమనివాసంబులకుఁ బోయిరి. కొన్నాళ్ళకు చిరంతపుఁ డుభయభ్రష్టుఁడై యందుకు గొరగానక నట్లే మరణించెను.

---

## బాల్యము.

అట్లు గతించిన పరంతపుఁ డుత్తరజన్మంబున నొకబ్రాహ్మణగర్భంబునఁ గుమారుఁడై పుట్టి రూపమన్మథుఁడై యెల్లరకు ముద్దుఁగొలుపుచు నధికగారాబముతోఁ బెరుగుచుండెను. కుఱ్ఱవాఁడు దినదినప్రవర్ధమానచంద్రుఁడై యైదేండ్లప్రాయుఁ డయ్యెను. తల్లిదండ్రులు వాని కక్షరాభ్యాస మొనరించిరి. అనంతర ముపనయనము మొదలగునవియుగూడ జరిగెను. కాని, వానిపొట్టఁ జించిన నొక్కయక్షరమైనను లేదు. నిరంతరము దుష్టులసాంగత్యమున దురాచారుఁడై, వేళ కింటికి వచ్చిమాత్రము కడుపునిండ భుజించి స్వేచ్ఛావిహారము సేయుచుండెను కాలక్రమంబున నతండు మఱింత మొండెఁడై గ్రామస్థులతోఁ గలహించుచుఁ దిట్టుచుఁ,

[illegible]డెను. ప్రజలు వాని బాధలఁ బడలేకపోయి వానితలిదం[illegible]మాటలు చెప్పుకొనియు, నింకమీఁదట మర్యాదగ సంచరింపఁడేని తగిన శాస్తిఁ జేసెదమని చెప్పుచుఁ బోవుచుండిరి. మాతాపితలు వాని కెన్నివిధములలో బుద్ధి గఱపిరి గాని, వానిదుష్ప్రవర్తనము మరలింప లేకపోయిరి. వారెంత గట్టిగా మందలించిన, నతఁడు జననీజనకులను గూడ గొట్టుచుండెను. తల్లిదండ్రులకు ప్రాణము విసిగి చెప్పవచ్చిన గ్రామస్తులతో నతఁడు మాకు పుత్రుఁడుగాఁడు. శత్రువుఁడు. ఇంక మీరిష్టానుసారముగ వాని నేమైనఁ జేసికొనుఁడని చెప్పివైచిరి. రోజుపైఁబడినకొలఁది వానిదుశ్చేష్టలు మితిమీఱిపోవుటచే గ్రామస్థు లందఱేకమై, యొకనాఁడు వానిని కుక్కను గొట్టినట్లు గొట్టి గ్రామాంతరములకుఁ బాఱఁదోలిరి.

పిమ్మట వాఁడు కూటికి గుడ్డకుఁగూడ మొగము వాచి యూరూరుఁ దిరుగుచు నొకయడవిలో కిరాతులుండు పల్లెకుఁబోయి వారి నాశ్రయించి తననడవడికిఁ దగినవారే దొరకినందులకు సంతసించి, నాఁటినుండి వారితో గలసి మెలసి సంచరింపుచు, మధుపానభక్షణము సేయుచు, జంతుహింసనం దనురక్తిఁ గలవాఁడై, బాటసారుల తలలఁ బగులఁగొట్టుచు నెన్ని ఘోరకృత్యంబులో సేయుచుండెను. చూచితిరా! వేదాధ్యయనసంపన్నుని కుమారుఁడు, వివేకజ్ఞానము లేక పశుప్రాయుఁడై యెట్లు సంచరించుచున్నాఁడో? విద్యాగంధము లేనివాఁడగుటచేత నేగదా కుల శీలములుగూడ మఱచి కేవలము కిరాతుఁడైపోయెను. కావున మానవ జాతికి విద్యయే పరమావధి.

---

## కిరాతునివివాహము.

ఆకిరాతుఁడుండు గ్రామంబునకుఁ గొలఁదిమైళ్ళదూరమునందున్న మాళవదేశమును సాళ్వుఁడను రాజు పాలించుచుండెను. ఆ రాజునకు శా

రదయను పుత్రికారత్నము గలదు. ఆమె సర్వాంగసుందరియు, సుశీలయు, సుగుణఖనియు నై మిగుల గారాబమున పెఱుఁగుచుండెను. రాజు, సకలవిద్యాసాగరుఁడగు నొకబ్రాహ్మణోత్తముని రావించి, సమస్తవిద్యలుఁ గఱపవలెనని తనకుమార్తెను వాని కప్పగించెను. బాలికారత్నము సూక్ష్మగ్రాహి యగుటచే, గురువులు చెప్పినదే తడవుగా సమస్తవిద్యలును కొలదికాలముననే నేర్చుకొనెను. విద్య సంపూర్తియగుటచే గురుదక్షిణగా ధనకనకవస్తువాహనాదు లిచ్చి గురువునకు సమర్పించి రమ్మని రాజు పుత్రికను బంపించెను. గురువు విద్యాసంపన్నుఁడే గాని, గుణసంపన్నుఁడు గాకుండుటచే, వచ్చినరాకుమార్తె నూత్నయౌవనకళాపిపాసాపీడితుఁడై మోహావేశమున నొడలు మఱచి బాలికారత్నముతో నిట్లనియె.

సుందరాంగీ! నీగురుభక్తి కెంతయు సంతసించితిని. నాకీ చీనిచీనాంబరధనాదు లేల ? నీవయోరూపలావణ్యాతిశయంబులు జూచిన నాఁటనుండియు, మదనశరాగ్నితప్తుఁడనై, కుసుమసన్నిభమగు నీతనులత నొకసారి బిగ్గఁగౌఁగిలించుకొని, నీకెమ్మోవి సుధారసధారలఁ గ్రోలి మత్తిల్లవలెనని, జలబిందువుకై వేచియున్న చకోరముభాతి వేచియున్నాను. నిజముగ గురుభక్తి గలదానవేని నాకోరిక నీడేర్పు మని, బాలికామణి కరంబును గ్రహింపఁ బోయెను.

గురుని మోహావేశపిశాచచేష్టలకు రాకుమార్తె భయాశ్చర్యసంభ్రమాయత్తచిత్తయై దూరంబుగఁ జని, “దురాత్మా! శిష్యద్రోహీ! ఎంతపాపమున కొడిగట్టఁదలచితివి ? గురు వనఁగాఁ దండ్రివంటివాఁడు. శిష్యులనఁగా బిడ్డలవంటివారుగదా ! బిడ్డసమాననగు నన్ను గవయఁ జూచెదవఁటరా పాపాత్మా ! నీకు వావివరుసలు లేవా ? పాపభీతి లేదా ? బ్రాహ్మణసంభూతుఁడవు కావా ? నరపశువా ! మాతండ్రితో నీయుదంత మెఱిఁగించి నీయసువులఁ దీయింపఁగలను గాని, గురువ

థామహాపాతకభయంబున నిన్ను క్షమించితిని. ఇఁక నెన్నఁడిట్టికోరి కలు గోరక మనియుండు"మని, చివాలున తనమందిరమునకుఁ బోయెను. పోవుచున్న బాలికతో, నీవు నాయాశాలత ద్రుంచివైచితివి గావున, నిందుకుఁ బ్రతిఫలముగ నేను ని న్నొకకిరాతున కిచ్చి పెండ్లి జేయింపకున్న నేను బ్రాహ్మణుఁడఁ గానని శపథముఁబట్టెను.

కొన్నిదినంబుల కాకన్యారత్నము దుష్టలగ్నమునఁ బుష్పవతి యయ్యెను. రాజున కాసంగతిఁ దెలిసి, యాబ్రాహ్మణగురువునే రావించి గ్రహశాంతిఁ జేయవలయునని విన్నవించెను. ప్రతీకారంబునకుఁ దగినయదను దొరకినదని యాబ్రాహ్మణుఁడు తనమనంబున సంతసించి, రాజేంద్రా! ఈయరిష్టము గ్రహశాంతులతోడను బ్రాహ్మణసంతర్పణల తోడను దీరునది కాదు. ఈనక్షత్ర మతిదుష్టమైనది గావున బాలికను పరిత్యజింపవలయును. కన్నకూఁతును పరిత్యజించుట దుర్ఘటము గావున, ధర్మశాస్త్రానుసారముగ నొకయుపాయముఁ జెప్పెదను. ఈకన్నియను సుక్షత్రియవంశసంజాతునకుఁగాక, విద్యావిహీనుఁడగువానికిచ్చి పెండ్లిఁజేసిన తద్దోషము నివారణమగును. లేదేని మీకు సర్వారిష్టము గలుగుట నిజమని వక్కాణించెను. రాజు కుమార్తెవిషయమై మిక్కిలి వగఁజెంది, బ్రాహ్మణుని యుపదేశము శిరసావహించి, విద్యావిహీనుఁడగు మూర్ఖునొక్కనిఁ దోడితెమ్మని సేవకుల కాజ్ఞాపించెను.

రాజభటు లాయాప్రదేశములకుఁ బోయి తిరుగు నట్టకేలకు బ్రాహ్మణకిరాతునిఁ జూచి, వీఁడన్నివిధంబులఁ దగియున్నవాఁడని తలంచి, 'ఓయీ! నీకు రాజుగారికుమార్తె నిచ్చి పెండ్లి జేసెదము రా' రమ్మని నయభయంబుల బుజ్జగించి వానిం దోడ్కొనిపోయి రాజునకు గురువునకు జూపించిరి. ఆదుష్టగ్రహనివారణమున కితఁ డెంతయుఁ దగియున్నవాఁడని గురువు చెప్పెను. రాజుమాత్రము కిరాతరూపధారియగు వాని కాత్మజ నిచ్చి పెండ్లిచేయవలసివచ్చెఁగదా? యని బహుభంగుల

జుంతించి, విధికృతమున కింతసేపు వగచి, చింతించినఁ బ్రయోజనము లేదుగదా యని, మనసు పదిలఁబఱచుకొని, యొకశుభదినంబున నాకిరాతునకు తనకూఁతురు నిచ్చి సామాన్యమైన వివాహముఁ గావించెరు.

నాఁటిరాత్రియే పునస్సంధానమహోత్సవముఁ గావింపఁదలఁచి చెలికత్తెలు రాకుమారిని సర్వాలంకారభూషితురాలుగా నొనరించి విలాసమందిరమునకు దోడ్తెచ్చుచుండిరి. ఇంతకుముందే పెండ్లికొడుకున కామందిరముఁ జూపించి, వాని నందుఁ బ్రవేశపెట్టిరి. అతఁ డామందిరచిత్రవిచిత్రాలంకారములను, పలువిధదీపకాంతులను, రత్నమణిమయ ప్రదీపులను, హంసతూలికాతల్పంబు నాదిగాఁ జూచి దిగ్భ్రమఁ జెంది, చెంత బంగారుపళ్లెరమునం దుంచఁబడిన పంచభక్ష్యాదులు గడుపార మెక్కి, మెల్లగా హంసతూలికాతల్పముపైఁ జేరి పరుండెను. అటులా పరిచారికలు రాజపుత్రిని బుజ్జగించి, యామె నెట్టులో శయ్యాగృహంబునఁ జేర్చి, తలుపులు మూసి యావలకుఁ బోయిరి.

రాకుమారి పసిడిబొమ్మవలె దేదీప్యమానప్రభలతో వెలుఁగుచుఁ బతికరస్పర్శభాగ్యమునకై, సిగ్గులజ్జాభరంబుతో నొకమూల నొదిగి వీక్షించుచుండెను. కాని, ప్రాణేశ్వరుఁడు శయ్యనుండి కదలమెదలకుండుటచే, వివాహబడలికవలన నిద్రించి యుండునని తలంచి, మఱికొంత సేపు శయ్యకుఁ సమీపముగనే నిలువఁబడి యుండెను. అప్పటి కర్ధరాత్రమైనను పతి మేల్కాంచకపోవుటచే నామె విచారాక్రాంతయై, వానిఁ దరిజేరి సుగంధద్రవ్యములతో వానికి శీతలోపచారములు గావించెను. వాని కాయుపచారములన్నియు నెనుబోతుమీఁద వర్షము గురిసినట్లుగాఁ బరిణమించెను. ఇదియుఁ గాదని కిన్నెరకంఠస్వరముతో గానముఁ జేసెను. అప్పటికిని వాఁడు నిద్రమత్తునుండియే యిటునటు గదలి "ఓసీ! అట్టె అరవక తొంగోసి" అని మరల ముసుఁగు పెట్టుకొనెను. ఆమె వానిమోటుదనమునకు భయసంశయాకులితస్వాంతయై, వానినిఁ దట్టి

లేపెను. అంతట వాఁడు త్రుళ్లిపడి లేచి "రొంకుకే అస్తమానం లేపు తా"వని గద్దించి పలికెను. ఆమె యెట్టలో ధైర్య మవలంబించి, 'మీ రెవ్వరు? మీవృత్తాంత మేమి' యని యడిగెను. అంత నతండు తన మోటుమాటలతో జరిగినకథ యంతయుఁ జెప్పెను. రాజకుమారి వాని మాటలు వినినంతనే తరులత వడకిపోయినది. హృదయము కంపించినది. భయోత్పాతములు గలిగినవి.

అమ్మో! దుర్మార్గుఁడగు గురువు తేఁగ్రామముందే నాజీవిత మంతయుఁ గదమట్టుఁ జేసెనుగదా! తనమనోరథము భగ్నముఁ జేసి తినని నామనోరథముఁగూడ భగ్నము జేసివైచెను. కానిమ్ము గతించి నదానికి జింతించుట వ్యర్థమని ధైర్యముఁ దెచ్చుకొని, వానిని సమీ పించి, "ఆర్యా! బ్రహ్మతేజము మీముఖమునం దావిర్భవించుచున్నది. దురభ్యాసముల మీ కట్టిగతికి వచ్చియున్నారు. మీరు విద్యావంతులై సుఖించుట కొకయుపదేశముఁ జేసెద. వినవలయు ననఁగ నతఁడు సరే యనెను. దేవా! ఈయూరి బైట కాళికాలయ మున్నది. ఆమె భక్తాభీష్టప్ర దాయిని. ఇప్పుడామె గ్రామసంచారము వెళ్లియుండును. మీ రాలయ మునకుఁ బోయి లోన గడియవైచుకొని కూర్చుండుఁడు. కాళి వచ్చి తలుపుఁదీయుమని గద్దించి పలుకును. మీరు భయపడక నాకు విద్యా దానముఁ జేసిన తలుపుఁ దీయుదు"నని చెప్పుఁడు. ఆమె మీభక్తికి మెచ్చి విద్యాదానము బ్రసాదించును. అనంతరము మనము హాయిగా సుఖింప వచ్చును. పోయిరమ్మని చెప్పెను. అంత నతండు నల్లెయని రాజకుమారి చెప్పినతెఱంగున కాళికాలయమున కేగి లోన గడియవైచుకొని నిర్భీతి గాఁ గూరుచుండెను.

---

## కాళికాదేవి ప్రత్యక్షము.

అంతఁ గాళికాదేవియుఁ బురమెల్లెడ స్వేచ్ఛావిహార మొనరించి నాలవజామునఁ దనయాలయముఁ బ్రవేశింపఁబోవ, లోనఁ దలుపులు

మూయఁబడి యుండుట కబ్బురంబుఁ జెంది రోషారుణితలోచనయై భీషణభాషణంబుల నిట్లనియె. "ఓరీ ! యెవడవురా నీవు ? నిర్భీతిగ నాదేవళంబుఁ జొచ్చి లోన గడియవైచుటకు నీగుండె లెట్లు తాళెనురా ? దురహంకారమున నొడ లెఱుంగక మృత్యుకరాళగహ్వరమునఁ జిక్కఁ జూచినంటివా ? దుర్మదాంధా ! నన్నెవతెగా భావించి యిట్లు సాహసించితివిరా ? లోకాపకారులగు రాకాసిమూకల జీకాకుపరచిన లోకమాత యగు మహేశ్వరి యని నన్నెఱుంగవు కాఁబోలు ! ముప్పదిమూఁడు కోట్లదేవతల కధిదేవతనై, చిత్స్వరూపిణినై, యాశ్రితజనకల్పవల్లినై, సకలచరాచరజంతుజాలమును పోషించునన్ను - హరిహరబ్రహ్మాదులేని తేరి చూడఁజాలని నన్ను నీయాగడమునకు గురిగావింప నెంచితివా ? నరపశువా ! ప్రాణములం దాసక్తిఁ గలదేని వైళంబ కవాటముఁ దెఱవుము." అని గద్దించిన దేవిపలుకుల కా బ్రాహ్మణకిరాతుఁడు గొంకుజంకు నెఱుంగక, 'తల్లీ ! నాకు బద్దెయిమ్ము. తలుపుఁ దీసెదను.' అని ప్రత్యుత్తర మిచ్చెను. బిద్దెలేదు. గిద్దెలేదు. ముందు తలుపు తెఱవు మని దేవి మరల గద్దించెను. బద్దె యిచ్చినఁగాని తలుపు దెఱవ నని యతఁడు బహులు చెప్పెను. అంతఁ గొక్కొరోకో యని కోళ్లు కూయసాగెను. తూర్పుకేఖలుగూడ కొంచెము దెల్లనగుచుండెను. ఇంక నాలసించిన నానిజస్వరూపము జనులకు గోచరించు నని తొందరగా లోనికిఁ బోవఁదలఁచి 'ఓరీ ! నీకు బిద్దె నిచ్చెద. తలుపురంధ్రముగుండ నీనాలుకఁ జాపుము.' అని చెప్పగా నతఁ డట్లు చేసెను. దేవి వానినాలుకపై బీజాక్షరములు వ్రాయగా నతఁడు తలుపులు దెరచెను. కాళికయు లోనఁ బ్రవేశించి, రూక్షేక్షణవీక్షణంబుల నాతని నవలోకించి 'దురాత్మా ! ఎవఁడవురా నీవు. నిర్భీతిగ నామందిరముఁ జొచ్చి, బలాత్కారవరములుఁ బడయఁ దలఁచితివా ! ఇదిగో ! దుష్టదానవులు పోయినమార్గమున నిన్నుఁగూడ జతజేసెద !' అని చివాలునఁ దనహస్తమెత్తెను. దేవి, బీజాక్షరములు

వ్రాసినంతనే వాని యజ్ఞానాంధకారపటలి పటాపంచ లయ్యెను. శారదపూర్ణిమాహిమాంశునివలె వానిమొగము కాంతినించెను బాలారుణ కాంతిప్రసారంబున వనజము వికసించినట్లు వానిబుద్ధి వికసించెను. సమస్తవిద్యలు వాని జిహ్వాగ్రమున సముద్రకెరటములవలె త్రుళ్లింతలాడుచుండెను. శివజటాజూటమునుండి భూమికి విడువఁబడిన గంగా స్రవంతివలె వానికవితారసప్రవాహము వెల్లివిరియఁ జొచ్చెను. అట్లుఘటనతంతు నిర్భయమునుగఁ జిరునగవు మొగంబుతో దేవికిఁ బ్రదక్షిణము జేసి ముకుళిత కరకమలుండై, యామెచరణరాజీవములు బట్టుకొని యిట్లు స్తుతింపఁ దొడఁగె.

స్తవము.

శ్లో. మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసాం,
మాహేంద్రనీలద్యుతికోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి.

శ్లో. చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః.

శ్లో. మాతా మరకతశ్యామా మాతంగీ మధుశాలినీ
కుర్యాత్కటాక్షం కల్యాణీ కదంబవనవాసినీ.

శ్లో. జయ ! మాతంగతనయే ! జయ ! నీలోత్పలద్యుతే !
జయ ! సంగీతరసికే ! జయ ! లీలాశుకప్రియే !

అని, యపూర్వకవితామాధురీజలంబుతో, శ్లోకచతుష్టయము వెల్లివిరియునట్లుగా స్తుతించి, వెండియు నోడలెఱుంగని భక్తిపారవశ్యం

బున నమ్మహాదేవిహృదయకమలము వికసించునట్లు దండక మొండు నాశుధారగా రచించి యిట్లుస్తోత్రము జేసెను.

## దండకము.

జయ! జనని! సుధాసముద్రాంత హృద్యన్మణిద్వీప సంరూఢ బిల్వాటవీమధ్య కల్పద్రుమాకల్ప కాదంబకాంతారవాసప్రియే, కృత్తివాసప్రియే! సాదరారబ్ధసంగీతభావనాసంభ్రమాలోల నీపస్రగాబద్ధ చూళీసనాథాత్రికే। సానుమత్పుత్రికే, శేఖరీభూత శీతాంశురేఖామయూఖావళీబద్ధ సుస్నిగ్ధనీలాలకశ్రేణి శృంగారితే। లోకసంభావితే; కామలీలాధనుస్సన్నిభభ్రూలతా। పుష్పసందేహకృచ్చారుగోరోచనాపంకకేళీలలామాభిరామే, సురామే, ప్రోల్లసద్వాలికామౌక్తికశ్రేణికాచంద్రికామండలోద్భాసిగండస్థలన్యస్త కస్తూరికాపత్రరేఖాసముద్భూత సౌరభ్యసంభ్రాంత భృంగాంగనాగీతసాంద్రీభవన్మంత్ర తంత్రీస్వరే। భాస్వరే; వల్లకీవాదనప్రక్రియాలోలతాళీదళాబద్ధ తాటంకభూషావిశేషాన్వితే, సిద్ధసమ్మానితే; దివ్యహాలామదోద్వేలహేలాలసచ్చక్షురాందోళన శ్రీసమాక్షిప్తకర్ణైకనీలోత్పలే, నిస్తులే; స్వేదబిందూల్లసత్ఫాలలావణ్యనిష్యందసందోహసందేహకృన్నాసికామౌక్తికే, సర్వమంత్రాత్మికే। కుందమందస్మితోదారవక్త్రస్ఫురత్పూగకర్పూరతాంబూల ఖండోత్కరే। శ్రీకరే; కుందపుష్పద్యుతి స్నిగ్ధదంతావళీ నిర్మలాలోలకల్లోలసమ్మేళనస్మేరశోణాధరే। చారువీణాధరే; బంధురచ్ఛన్నహారాదిభూషాసముద్యోతమానానరంభ చంద్రోదయోద్వేల లావణ్యదుగ్ధార్ణవావిర్భవత్కంబుబిబ్బోకహృత్కంధరే। మంధరే; బంధురచ్ఛన్నహారాదిభూషాసముద్యోత మానానవద్యాంగశోభే, శుభే; రత్నకేయూరరశ్మిచ్ఛటాపల్లవప్రోల్లస ద్దోర్లతారాజితే। యోగిభిః పూజితే; విశ్వదిఙ్మండలవ్యాప్తిమాణిక్యతేజస్స్ఫుర త్కంకణాలంకృతే।

సాధుభి స్సత్కృతే; సాంగరారంభవేళాసముజ్జృంభమాణారవింద చ్ఛంద
పాణిద్వయే । సంతతోద్యద్దయే; దివ్యరత్నోర్మికాదీధితిస్తోమసంధ్యాయ
మానాంగుళీ పల్లవోద్యన్నఖేందుప్రభామండలే । ప్రోల్లసత్కుండలే;
తారకారాజనీకాశహారావళి స్మేరచారుస్తనాభోగభారానమన్మధ్యవల్లీ
కళాచ్ఛేదవీచీసముల్లాస సందర్శితాకారసౌందర్యరత్నాకరే, శ్రీకరే;
హేమకుంభోపమోత్తుంగవక్షోజభారావనమ్రే । త్రిలోకావనమ్రే; లస
ద్వృత్తగంభీరనాభీసరిత్తీరశైవాల శంకాకరశ్యామరోమావళీభూషణే ।
మంజుసంభాషణే; చారుశింజత్కటీసూత్రనిర్భర్త్సితానంగలీలాధనుశ్శింజినీ
డంబరే, దివ్యరత్నాంబరే; పద్మరాగోల్లసన్మేఖలాభాస్వరశ్రోణి శోభా
జితస్వర్ణభూభృత్తలే । చంద్రికాశీతలే; వికసితనవకింశుకాతామ్రదివ్యాం
శుకచ్ఛన్నచారూరుశోభాపరాభూతసింధూర శోణాయమానేంద్రమాతం
గ హస్తార్గళే । శ్యామలే; కోమలస్నిగ్ధనీలోత్పలోత్పాదితానంగతూణీర
శంకాకరోద్దామజంఘాలతే, చారులీలాగతే; నమ్రదిక్పాల సీమంతినీకుం
తలస్నిగ్ధనీలప్రభాపుంజసంజాతదూర్వాంకురాశంక సారంగసంయోగ రిం
ఖన్నఖేందూజ్జ్వలే । ప్రోజ్జ్వలే; దేవి! దేవేశ, దైత్యేశ, యక్షేశ, భూతేశ,
వాగీశ, కోణేశ, వాయ్వగ్ని మాణిక్యసంఘృష్టబాలాతపోద్దామ లాక్షార
సారుణ్యలక్ష్మీగృహీతాంఘ్రిపద్మద్వయే । అద్వయే; సురుచిరనవరత్న
పీఠస్థితే । సుస్థితే; శంఖపద్మద్వయోపాశ్రితే, ఆశ్రితే; దేవి! దుర్గా
వటుక్షేత్రపాలై ర్యుతే, మత్తమాతంగకన్యాసమూహాన్వితే, భైరవైరష్ట
భిర్వేష్టితే, దేవి! వామాది భిస్సంశ్రితే, లక్ష్మ్యాదిశక్త్యష్టకాసేవితే ।
భైరవీసంవృతే; పంచబాణేన । రత్యాచ సంభావితే, ప్రీతిశక్త్యా వసం
తేన చానందితే । భక్తిభాజాంపరంశ్రేయసే । గీతవిద్యావినోదాతి
తృష్ణేన కృష్ణేన సంపూజ్యసే । భక్తిమచ్చేతసా వేధసా స్తూయసే ।
విశ్వహృద్యేన విద్యాధరై ర్గీయసే । యక్షగంధర్వసిద్ధాంగనా మండ
లై ర్మండితే । సర్వసౌభాగ్యవాంఛావతీభి ర్వధూభి స్సురాణాం సమా

రాధ్యసే। సర్వవిద్యావిశేషాన్వితం। చాటుగాథాసముచ్చారణాం కంఠ మూలోల్లసద్వర్ణరేఖాన్వితా। కోమలంశ్యామలోదారపక్షద్వయం తుండ శోభాతి దూరీభవత్కింశుకాభం। శుకం లాలయంతీ। పరిక్రీడసే। పాణిపద్మద్వయే నాపరేణాక్షమాలా గుణం। స్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్తకం బిభ్రతీ। యేన సంచింత్యసే। చేతసా తస్య వక్త్రాంతరాద్గద్య పద్యాత్మికాభారతీ నిస్సరే। ద్యేనవాయావకాభాకృతిర్భావ్యసే సోపి లక్ష్మీసహస్రైః పరిక్రీడసే। కింనసిద్ధ్యేద్వపుశ్శ్యామలం। కోమలం। తావకం చంద్రచూడాన్వితం। ధ్యాయత స్తస్య లీలాసరోవారిధి స్తస్య కేళీవనం। నందనం। తస్యభద్రాసనం భూతలం। తస్యగీర్దేవతా కింకరీ తస్యచాజ్ఞాకరీశ్రీస్స్వయం। సర్వయంత్రాత్మికే। సర్వచక్రాత్మికే। సర్వవర్ణాత్మికే। సర్వరూపే। జగన్మాతృకే! పాహి మాం। పాహి మాం। పాహి॥

కోపోద్రిక్తురాలై వాని నంత మోదింపనున్న దేవి; యాకిరాతునికవిత్వ మప్రయత్నముగ వెలువడిన తద్విరచితమాధురీరస ప్రభావంబున కెంతయు నుప్పొంగి సుప్రసన్నయై వానికి వలయువరంబు లిచ్చి పంపెను. అతండు నాఁటినుండి కాళీవరప్రసాదుఁడై, కాళీదాసుఁ డగుటచేఁ, గాళిదాసుండను పేరఁ బిలువఁబడుచుండెను. అంత నతండు దేవీసన్నిధానమునుండి వెలుపలకు వచ్చి, యింకను దెల్లవారకుండుటచే వెంటనే రాజమందిరమున కేగి, తనరాకకై వేచియున్న భార్యను జూచి యామెపాదములపైఁ బడి, 'ఓసాధ్వీమతల్లీ! నీవు నాకు భార్యవు కావు. నీహితోపదేశమున నామౌఢ్యము నశించి విద్యావంతుఁడ నైతిని. కావున, నేఁటినుండి నీవు నాకు తల్లివి. ఎట్లనిన నిదివఱకైనను నిన్ను నేను భార్యాదృష్టితోఁ జూడలేదు. ఎన్నఁడు నాకట్టి కోరికయు లేదు. శెలవిచ్చినఁ బోయి వచ్చెద.' అని పలుకఁగా నాతనిపలుకుల కామె భయాశ్చర్యదృక్కులతో వాని యాపాదమస్తకముఁ బరిశీలించి విషాద

చిత్తయై కనుగొలంకులనుండి బాష్పబిందువులు జలజలరాల, భయకంపితశరీరముతో గద్గదస్వరముతో నిట్లనియె. 'ఓమహానుభావా! విద్య నేర్పినగురువు నాకొనర్చినమహాపకారమునకు మిక్కిలి దుఃఖించి, తత్ప్రతీకారమునకై దేవీసన్నిధానమునకు మిమ్ములఁ బంపితిని. మన పూర్వజన్మసుకృతవిశేషంబున నాదేవి మీకు సాక్షాత్కరించి, విద్యావిశారదునిఁ గావించినది. దేవీవరప్రసాదంబు వడసి మీ రెప్పుడు వచ్చెదరా యనియు, నవ్యరచనమ్ము మీసూక్తులచే నన్నెప్పు డలంకరింతురా యనియుఁ గొండంత యాశతో మీరాకకై వేచియుంటిని. వచ్చితిరి. చిచ్చరపిడుగువంటి వార్తచే నాహృదయమును బగులఁగొట్టితిరి. లోకవిరుద్ధముగ నమ్మాయని నన్ను పిలుచుచుంటిరి. ఇది ధర్మమా? అగ్నిసాక్షిగ బెండ్లాడిన యిల్లాలి నిట్లు తల్లీ యని సంబోధించు పెద్దెనఁ గలదా? భార్యోపదేశమువలన బాగుపడినభర్తలు లోకంబున లేరా? వారందఱు మీవలెనే యజ్ఞానమునఁ బ్రవర్తించిరా? ప్రాణేశ్వరా! మీజ్ఞానోదయభాస్కరునివలన, ముకుళించిన నాహృదయకమలము వికసించునని గంపెడాసతో నున్న నాయాశాలత మీవాక్య మనుకత్తిచేఁ దుత్తునియలు గావించుటధర్మమా? మీనిరాదరణకంపముచే గొంతుకోయుటకు నేఁ జేసినహితోపదేశమునకుఁ బ్రతిఫలమా నాథా! మనోనాథా! నన్ను భాగినిగా జేయుఁడు. ఇదే మీచరణరాజీవంబులు బట్టుకొందును. నా మొఱాలించి రక్షింపుఁడు." అని ప్రార్థించెను. కాని వానిమనసు లవంతేనియుఁ గరగలేదు. వానిహృదయము వజ్రసన్నిభమైనది. నిరాకరించి పోఁదలచెను అంత నాయిల్లాలు కోపానలతప్తహృదయమై కను లెఱ్ఱఁ జేసి, కుసుమపేశలమగు నాజీవితజ్యోతిని నిశ్శేషముగ ఖండించివైచితిరి కావున మీరుకూడ నొకనీచకులాంగనవలన ఖండింపఁబడుదరుగాక. అని శపించి నేలపైఁబడి మూర్ఛిల్లెను. వెంటనే కాళిదాసామందిరమునుండి వెడలిపోయెను. అనంతర మాసాధ్వీశిరోమణి తనయనుమాల్య

భూషణాంబరములనెల్ల విడనాడి నారచీరలు గట్టి రేయుంబవళ్లు పతివ్రతాధర్మంబునఁ గాలంబు గడపి యవసానకాలంబున విష్ణుసాన్నిధ్యంబు నకు జేరెను.

---

## కాళిదాస భోజరాజ సమాగమము.

కాళిదాసుఁ డటుల భార్యను పరిత్యజించి, తనకవితాకన్య నాదరించి పోషించు మహారా జెవ్వఁడైన దొరకునా యని వాడవాడలఁ దిరుగాడుచు మార్గాయాసంబు నపనయింప నొక సత్రంబున విశ్రమించెను. అందొకచో నల్వురు బ్రాహ్మణులు గూరుచుండి కవిజనకామధేనువగు భోజమహారాజు వితరణగుణగణంబులఁ బొగడుచుండఁ గాళిదాసు విని, వారలం జేరి, 'భూసురోత్తములారా! ఆ రాజేంద్రుఁ డెందున్నవాఁడు? ఎయ్యది వానిరాజధాని? వాని మహోదారగుణంబు లెట్టివి? వినవలయునని మిక్కిలి కుతూహలముగా నున్నది. తెలిపియుఁడ' ని విన్నవించెను. వా రిటులఁజెప్పిరి.

ధారానగరమును రాజధానిగఁ జేసికొని, మాళవదేశమును భోజమహారాజు పాలించుచుండెను. అప్పటినుండియు, నప్పట్టణము సరస్వతీదేవికి నిలయమై, చతుర్దశవిద్యల కునికిపట్టయి, సంస్కృతమె మాతృభాషగాఁ బరిగణింపఁబడు చుండెను. సంస్కృతము రానివాఁడు నూటికొక్కఁడైనను లేడనియే చెప్పవచ్చును. వేయేల? కవులకు పండితులకు నక్షరలక్ష లిచ్చి పోషించుచున్నాఁడు. మఱియు వాని వదనారవిందసందర్శనభాగ్యంబున బుద్ధి వికసించి, మాఘుకిజలంబువలెఁ గవిత్వము పుట్టుకొనివచ్చును. వాని దర్శనమే పేదకు పెన్నిధి యబ్బినట్లు. అన విని కాళిదాసుఁడు లోకంబునఁ బ్రతివిద్యకు నాదరణయుండినఁగదా! రాణించును. ఇంక నావిద్యావినోదాతిశయములు జూపించి, యఖండ కీర్తియు, నపారధనంబును సంపాదింప నారాజాస్థానమె తగియున్నది.

కవులకు మూఁగొంగుబంగారమైన భోజరాజచంద్రునివలననే నాకీర్తిచంద్రికలు ప్రసరింపనున్నవి అని తనమనమున నిశ్చయించుకొని ధారానగరంబునకు ప్రయాణమై పోయెను.

భోజునాస్థానంబునఁ గవిత్వ, సాహిత్యాదివిద్యలం దారితేరిన ముగ్గురు కవిశేఖరులుండిరి. వారి కసాధారణమైన సునిశితబుద్ధియుఁ గవితాప్రభావంబును గలిగి, సాటిలేని మేటికవీశ్వరులై, రాజానుగ్రహమునకుఁ బాత్రులై యుండిరి. పండితు లెవరైన రాజేంద్రుని దర్శింప వచ్చిన దమకంటె నెక్కుడుగ గౌరవింపఁబడుదురేమో యని మత్సరగ్రస్తులై రాజదర్శనము గాకుండఁజేయుటయే వారిముఖ్యోద్దేశము. మఱియు నేకసంతగ్రాహి, ద్విసంతగ్రాహి, త్రిసంతగ్రాహి యని వారికి బేళ్లుఁ గలవు. ఏకసంతగ్రాహి యనగా నెటువంటిశ్లోకమైన నొకసారి విన్నపక్షమున, దా నిదివఱకే చదివియున్నట్లు గడగడ చదివివేయును. ద్విసంతగ్రాహి, రెండుసార్లు వినియున్న, నిది పూర్వశ్లోకమే నని కంఠోపాఠముగఁ జదువును. త్రిసంతగ్రాహి మూఁడుపర్యాయములు వినిన ప్రాంతశ్లోకముఁ జదివినట్లే చదువును. ఇట్లు వీరుమువ్వు రొక్కటియై రాజదర్శనార్థమై వచ్చినప్రతివారును వీరిమైత్రిఁ జేసికొనరాఁగా, ముప్పురాతనితో నొకశ్లోకమును జదువుఁడని కోరుదురు. అతండు తాను రచించినశ్లోకమును జదువఁగా నేకసంతగ్రాహి నవ్వుచు, నిదేమి శ్లోకమండీ! ఇది పూర్వులు రచించినదే కదా! అని యతఁడాశ్లోకమును దిరిగి చదువును. నిజమేనండీ?! నాకుఁగూడ వచ్చునని ద్విసంతగ్రాహి చదువును. ఈశ్లోకము వెనుక మాగురువుగారు నాకు జెప్పినదేనండీ! అని, త్రిసంతగ్రాహి చదువును. వీరికపటవిద్యానైపుణ్యమున కాకవీశ్వరుఁ డెంతయు సిగ్గునఁ దలవంచుకొని వచ్చినదారినే వెడలిపోవును. ముప్పు రీకృత్రిమకవితానైపుణ్యముం బ్రదర్శించి, తమలో దా మువ్వాగుచుండిరి. కవియనువాఁ డొక్కఁడును రాజాస్థానమునకు రాకుండుటచే, భోజను

హీపాలుఁడు కవిత్రయముతో నొక్కకవివర్యుఁడైన మనయాస్థానము నకు రాకున్నకారణ మేమని పలుమారులు ప్రశ్నించుచుండువాఁడు. వార లారాజేంద్రుని పలుకులకు నవ్వుకొనుచు, రాజమార్తాండా! మీకవితాప్రభావము జగత్ప్రసిద్ధముగుట, నెంతటికవిశేఖరు లేని మీగౌరవముఁ బడయఁజాల మని వెఱచి మూలమూలల నక్కియుండిరి. అనర్గళమగు మీకవితాధాటికి వాణీపంకజాసనులే వెఱగందుచుండ, మీ ముందుఁ గవిత్వముఁ జెప్పసాహసించువాఁ డెవ్వఁడుండును? అని పొగడుచు తమకృత్రిమనాటకము రాజునకు దెలియకుండగనే హాయిగా కాలము వెళ్లఁబుచ్చుచుండిరి.

అటుల గాళిదాసుఁడు రాజసందర్శనార్థమై చని ముందుగా, రాజాస్థానకవుల దర్శించుట సముచితమని తలంచి, కవిత్రయ మొకచోఁ గూరుచుండియుండు టెఱింగి వారికడ కేగి భక్తివినయములతో నమస్కరించి, తాను కవిత్వముఁ జెప్పెద ననియు, రాజదర్శనముఁ గావింపుడనియు సవినయముగఁ బ్రార్థించెను. వా రతనిఁ గాంచి ఏదీ! నీవు రచించినశ్లోక మొకటి చదువు మనఁగా, నింతకుముందే వారికపటనాటకమంతయుఁ గాళిదాసుఁ డెఱింగినవాఁ డగుటచే, వారిని దనవలలో జిక్కించుకొని, తగినపరాభవముఁ జేయఁదలఁచి, హాస్యాస్పదముగనుండు శ్లోకమొండు రచించి యిటులఁ జదివెను.

శ్లో. అస్తిన ద్బకవ చ్చైవ చల్లవ త్తెల్లకుక్కవత్
రాజతే భోజ! తే కీర్తిః పున స్సన్న్యాసిదంతవత్.

తా. భోజరాజేంద్రా! నీకీర్తి యెముకవలెను, కొంగవలెను, మజ్జిగవలెను, కుక్కవలెను, సన్న్యాసిదంతమువలెను తెల్లగానున్నది.

రసహీనమగుమాటలతో గూడియున్న యాశ్లోకమును విని తమలోఁదాము నవ్వుకొనుచు, 'మీశ్లోకము చాలరసవంతముగా నున్నది. మీరు రేపుదయము దయచేసిన రాజదర్శనముఁ జేయించెదము. రం'డ

ని చెప్పి వానిం బంపివేసిరి. పిమ్మటఁ గవిత్రయము చిట్లని యోచింపఁ దొడఁగిరి. "మనరాజేంద్రుఁడు, కవులు వచ్చుచుండుట లేదని కలవరించుచున్నాఁడు. రేపు పిసిసి గొంపోయితిమేని, వాని యవకతవక పాండిత్యమునకు రాజేంద్రుఁ డసహ్యపడి, యిట్టికవులనింక నాస్థానంబునకుఁ గొనిరావలదని యాజ్ఞాపించును. అంతటనుండి రాజేంద్రుఁడు మనయం దధికానురాగము గలిగి యుండును. మనగౌరవము జీవితానంతరమువఱకు నట్లే యుండగలదు." అని తలంచుకొని, మఱునాఁ డుదయమున రాజేంద్రుఁడు సింహాసనాసీనుఁడై యుండఁ గవిత్రయము దమతమయున్నతాసనముల పైఁ గూరుచుండిరి. జీర్ణాంబరధారియగు కాళిదాసుఁ డొకమూలనొదిగి కూర్చుండి యుండెను. అంత నేకసంతగ్రాహి లేచి, కాళిదాసును భోజరాజునకు జూపుచు, రాజన్యచూడామణీ! ఇతండు గౌడదేశీయుఁడు. కవిచంద్రుఁడు. దేవరవారిమీద రసవంతమైనకవిత్వము వ్రాసియున్నాఁడుట. సావధానముగఁ జిత్తగింతురుగాక అనెను. మహీపాలుఁ డెంతయు సంతోషమునఁ జదువుఁడని వానికాజ్ఞ యిచ్చెను. అంతఁ గాళిదాసుఁడు లేచి వెనుకటి వెట్టిమొట్టిశ్లోకముఁ జదువకఁ గవిత్రయముగుండెలు బగుల, సభాసదులు నిశ్చేష్టులుగాఁగ, మహీపాలుఁ డానంద కవితారస ప్రవాహమున నోలలాడఁ గఠినాక్షరదుర్ఘటసమాసయుక్తంబులగు శ్లోకంబుల నిట్లు జదివెను.

శ్లో. వాశ్చారెద్ధ్వజథగ్ధృతోడ్వధిపతిః క్రుద్రేడ్జజానిర్గణే
డ్గోరాడారుడురస్సరే డురుతరగ్రైవేయః భ్రాడస్రం
ఉడ్వీడఋజ్ఞరకాస్థిధృక్త్రిదృగిభేడార్ద్రాజినాచ్ఛాదన
స స్స్యా దంబుమదంబుదాళి గళరుగ్ద్గో ముదే వో మృడః

రెండవశ్లోకము.

శ్లో. షడ్డ్వాషడ్జఖరాడ్జపీడ్జవసుధాడ్జాలాంశ్చ మడ్జాఖరే
జడ్జట్కిట్కి ధరాడ్ఢరే ద్భునఘునః ఖడ్జోతవిద్యుద్భ్రమా

వీడ్యా లుద్ర్భుమ లుట్టి యట్పి యపటాడడ్గిగ్గి డడ్గిగ్గిహా
పాదాట్రేట్ప టటట్రప్ప టట్రప్పటర సట్రప్పఖ్యాతసఖ్యోద్ధయాః.

మూఁడవశ్లోకము.

శ్లో. ద్వైతేష్ఠ వద్ధ వజి వీష్ఠ్రుతాత్రి రసు భర్ద్గర్వ్యప్రకీడి శ్వస్ర
ద్రతుః ప్రేతుగా ష్ఠేరనుర్ధ ద్రుగిభేద్రదర్పి్కటు భద్విద్ర మేట్
దేవేడీశితపత్పునాతు విగహా దారుడయా వాడ్విరా
ట్స్వద్విష్ఠు గ్బహుకద్రిపొహుబ్యాఘుపభేద్రుజ్మస్వరడ్విడ్విషః.

నాల్గవశ్లోకము.

శ్లో. తిగ్మశ్విత్సితరుచుస్సద్రుగ్యగదద్రుక్షో ద్రుక్ష గజ్బాక్షియు
గ్పత్యార్యరాట్ఫణిరాట్పయే ద్ధృతమహీ భృద్రాభగ్మహాచక్రపాట్
పాయాన్నోఘడగంబఘు ఘ్నువరుచిర్ద్రోగ్యద్విష్ఠ్వదజ్ఞోష్మవి
ద్భక్తాభీష్టదకామధుగ్భవ నసుద్ర్బహ్మాదరట్స్రీవిరాట్.

అయిదవశ్లోకము.

శ్లో. శుండాలేద్విడ నీలకాండ వినుతో వీటాకాండ కాండో పృషే
టాకాండః కాండజకాండ కాండ ధరజిత్స్భిండ చూడామణిః
శుండాలాస్య షడాస్య సేవ్యచరణా సౌఖ్యా శివసాదరం
దద్యాదద్య సకాండకాండ దగళశ్వేటుకాండలీటుకాండలీ.

కాళిదాసు చదివిన శ్లోకపంచకము భోజరాజు విని యాశ్చర్య చకితుఁడయ్యెను. కవిత్రయములో నేకసంతగ్రాహి కించుక శక్తియుండుటచే కఠినాక్షరసమాసయుక్తముగు నాశ్లోకముల నతఁడు తిరిగి చెప్పలేకపోయెను. ద్విసంతగ్రాహి రెండవమారు శ్లోకమును వినకుండుటచే నతఁడు ధారణ చేయలేదు. త్రిసంతగ్రాహి తికమకలై గ్రుడ్లుమిటకరించి చూచుచుండెను. ఈవిధముగఁ గాళిదాసుఁడు వారినోటికి తాళములు వైచి, కాళీవరప్రసాదలబ్ధకవితాధార తనజిహ్వాగ్రమునుండి వెలువడి,

గంభీరభావపరంపరలు సుశబ్దయుక్తంబుగ ద్రాక్షారసవాహినివలెఁ బ్రవహింప భోజరాజేంద్రుని యశఃకీర్తి లీక్రిందివిధముగ స్తోత్రముఁ జేసెను.

శ్లో. మహారాజ! శ్రీమన్! జగతి యశసా తే ధవళితే
పయఃపారావారం పరమపురుషోయం మృగయతే
కపర్దీ కైలాసం కరివర మభౌమం కులిశభృత్
కళానాథం రాహుః కమలభవనో హంస మధునా.

తా. శ్రీయుతుఁడవైన యోభోజమహారాజా! నీకీర్తిచే లోకమంతయుఁ దెల్లబడిపోయినది. సముద్రములన్నియుఁ దెల్లనగుటచే శ్రీమహావిష్ణువు తనకు నిలయమైన పాలసముద్రమును గుర్తింపలేక వెదకి కొనుచున్నాఁడు. ఆవిధముగాఁ గొండలన్నియుఁ గూడ దెల్లనగుటచే శంకరుఁడు తనవెండికొండకొఱకును, యేనుఁగులన్నియుఁ దెల్లఁబడుటచే నైరావతముకొఱకు నింద్రుఁడును, గ్రహములన్నియుఁ దెల్లఁబడుటచే రాహువు చంద్రునికొఱకును, పక్షులన్నియుఁ దెల్లనగుటచే బ్రహ్మ తనహంసను గుర్తింపఁజాలక వెదకికొనుచుండెను.

ఆ శ్లోకమును రాజేంద్రుఁ డాలించినంతనే పరమానందభరితుఁడై తూర్పుదిక్కుమొగంబుగాఁ గూర్చున్న మహీపాలుఁ డంత దక్షిణదిక్కునకు మొగము ద్రిప్పి కూర్చుండెను. తనుచదివినశ్లోకము రసవంతముగ నుండమిచే రాజన్యుఁడు మొగ మావలకు ద్రిప్పుకొనెనేమో యని కాళిదాసుఁడు శంకాకులితస్వాంతుఁడై, మొదటిశ్లోకముకంటె మిక్కిలి రసవంతమగు శ్లోకముఁజెప్పి మహీపాలుని మెప్పింపవలయునని యీక్రింది విధముగా వర్ణించెను.

శ్లో. నీరక్షీరే గృహీత్వా నిఖిలఖగతతీ ర్యాతి నాళీకజన్మా
తక్రం ధృత్వా తు సర్వా నటతి జలనిధీం శ్చక్రపాణి ర్ముకుందః
సర్వా నుత్తుంగశైలా న్దహతి పశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్
వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతే! భోజరాజ క్షితీంద్ర!.

తా. హంసలు, క్షీరనీరములను వేరుపరచు గావున బ్రహ్మదేవుఁడు, పాలును నీళ్ళును చేతఁబట్టుకొని బయలుదేరెను. చల్లబోట్టు వేయగానే పాలు తోడుకొనును గావున, లక్ష్మీపతి మజ్జిగ చేతఁబట్టుకొని క్షీరసముద్రమును గనుఁగొనుటకై పోవుచుండెను. పరమేశ్వరుఁడు తనవెండికొండను గుర్తించుటకై, పర్వతరాజముల నెల్లఁ దనమూఁడవనేత్రంబుఁ దెరచి భస్మముఁ గావించుచున్నాఁడు. నీకీర్తికాంత ముల్లోకములందును వ్యాప్తిఁ జెందుటచేత లోకమిట్లుఁజీకాకుఁ జెందుచున్నది సుమా! ఓ భోజరాజా!

ఈశ్లోకము శ్రవణానందకరమగుటచే భోజరాజు సంతోషితస్వాంతుఁడై దక్షిణదిక్కునుండి గిరుక్కున పశ్చిమాభిముఖుఁ డయ్యెను. ఈశ్లోకముఁగూడ రాజేంద్రునకు రసవంతముగ లేదుగాబోలు నని తలంచి, కాళిదాసుఁడు వాటికన్న నెక్కుడు రసముగనుండుదానిం జెప్పవలయునని, మరల వానికీర్తి నిట్లు వర్ణించెను.

శ్లో. విద్వద్రాజశిఖామణె! తులయితుం ధాతా త్వదీయం యశః
కైలాసం చ నిరీక్ష్య తత్ర లఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే
ఉక్షాణం తదుప ర్యుమాసహచరం, తన్మూర్ధ్ని గంగాజలం
తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరి స్ఫారం సుధాదీధితిమ్.

తా. పండితశిఖామణివైనయో రాజా! బ్రహ్మదేవుఁడు నీకీర్తిని తూచఁదలచి యొకతక్కెడలో నీకీర్తిని బెట్టి, రెండవతక్కెడలోఁ గైలాసపర్వతముఁ బెట్టి తూచగా, నీకీర్తితో గైలాసముగూడ తేలికగా నుండుటచే సమానము జేయఁదలచి, కైలాసముపై నెద్దు నెక్కించెను. అప్పటికిని నీకీర్తితో తులదూఁగ లేకపోవుటచేత, నెద్దుపై శివుని నెక్కించి, వానిశిరముపై గంగను నిలిపినప్పటికి తుల సమానము గాకుండుటచే, వానితలమీద నాదిశేషునను నిలిపి, యప్పటికిని తూనిక సరిపోకపోవుటచే, నాతనిపైఁ జంద్రుని నిలిపెను. అప్పటికిని నీకీర్తియే బరువైనది.

ఈశ్లోకము వినగానే భోజభూపాలుఁడు పశ్చిమదిక్కునుండి మరలి యుత్తరాభిముఖుం డయ్యెను. శ్లోకత్రయముఁగూడ రాజున కాహ్లాదముగా నుండలేదని కాళిదాసుఁడు తలంచి, వానియశః కీర్తులు మరల నీవిధముగ వర్ణించెను.

శ్లో. స్వర్గా ద్గోపాల! కుత్ర వ్రజసి? సురమునే! భూతలే కామధేనో
ర్వత్సస్యానేతుకామ స్తృణచయ, మధునా ముగ్ధ! దుగ్ధం న తస్యాః?
శ్రుత్వా శ్రీభోజరాజప్రచురవితరణం వ్రీడశుష్క స్తనీ సా,
వ్యర్థో హి స్యాత్ ప్రయాస స్తదపి తదరిభి శ్చర్వితం సర్వ ముర్వ్యాం.

ఈశ్లోకము, స్వర్గావాసియగు గొల్లవానికిని, నారదునకును సంభాషణముగా నర్థ మిచ్చుచున్నది.

నారదుఁడు—ఓగొల్లవాఁడా! స్వర్గమునుండి యెక్కడ కేఁగుచుంటివి?

గొల్లవాఁడు—ఓనారదమునీంద్రా! కామధేనువుదూడకు గడ్డి తేవలెనని, భూలోకమున కేఁగుచున్నాను.

నారదుఁడు—ఓయీ! వెఱ్ఱిగొల్లఁడా! తల్లిదగ్గర పాలులేవా?

గొల్లవాఁడు—శ్రీ భోజమహీపాలుని జగద్విఖ్యాతమైనకీర్తిని కామధేనువు విని సిగ్గుపడగా దానిపొదు గెండిపోయినది.

నారద—అటులయిన భూలోకములో గడ్డిలేదు. ఏమందువా? ఆగడ్డినంతయు భోజరాజుశత్రువులే నమలివైచిరి.

ఆశ్లోకచతుష్టయము నాలించిన రాజేంద్రుఁడు మందస్మితవదనారవిందుఁడై వెంటనే సింహాసనము డిగ్గి, కాళిదాసునకు శిరస్సాష్టాంగవందనము లాచరించి యిట్లనియె. కవిసార్వభౌమా! రసము చిప్పిలుచున్న నీనాలుగుశ్లోకములకు నారాజ్యమందుగల నాలుగుదిక్కులును నీకు సమర్పించుకొంటిని. కావున నీ వీరాజ్య మంతయు నేలుకొనుము. నే నింక కాశికానగరంబున కేగి తపోనిష్ఠాగరిష్ఠుఁడనై కాలంబుఁ గడపు

కొనెదనని వెడలిపోఁబోవఁ, గాళిదాసుఁడెదురై, రాజదేవేంద్రా! ఇదేటి న్యాయము? ఇట్టిధర్మ మెందైనఁ గలదా? జనపాలురు మీరు. వనవాసిని నేను. సకలశాత్రవవిచ్ఛేదనాఖడ్గంబు మీది. సకలజనవశీకరణగంటంబు మాది. మహీపాలనాభారము విష్ణ్వంశసంభూతులగు మీవంటివారికిఁ దగుగాని, మావంటిశుద్ధశ్రోత్రియులకుఁ దగునా? ఓరాజన్యచూడామణీ! ఈధరాభారము మీరే నిర్వహించి మాబోంట్లను రక్షింపుఁడని సవినయముగఁ బ్రార్థించెను. అంత మంత్రిసామంతాదులెల్లరు చేతులు జోడించుకొని రాజేంద్రునకుఁ బ్రణమిల్లి, రాజ్యస్వీకారముఁ జేయుఁడని విన్నవించిరి. అంత భోజరాజు, కాళిదాసునకు ధారవోసినరాజ్య మెట్లు పరిగ్రహింపవచ్చు నని పలుకగా పెద్దలయినఁ గాళిదాసునకు నపారధనరాసు లిచ్చి క్రయమునకుఁ బుచ్చుకొనిన నాదోషపరిహార మగునని హితోపదేశ మొనరించిరి. సభ్యులందఱు వల్లె యనిరి. రా జందులకు సమ్మతించి, ధనకనకవస్తువాహనాదుల నిప్పించి కాళిదాసునకు సమర్పించి, నేటినుండి మాయాస్థానపండితులుగా నుండుఁడని ప్రార్థించెను. కాళిదాసుం డందుల కంగీకరించెను. కాళిదాసునకు గలిగినమహాగౌరవముఁ జూచి కవిత్రియ మీర్ష్యాగ్రస్తులై, వారిలోవారు గుసగుస లాడుకొని, కాళిదాసునకుఁ బరాభవము జేయఁదలఁచి రాజుతో నిట్లనిరి. ఓభోజమహారాజా! ఈకాళిదాసు దేవరవారిమీఁదఁ జదివిన "మహారాజ శ్రీమన్" అను శ్లోకము మొదలు నాలుగుశ్లోకములును పూర్వకవికృతములు గాని, కాళిదాస విరచితములు గావు. అవి విక్రమార్కమహారాజును గుఱించి యెవరో చెప్పగా, నితఁడు వాటిని సంగ్రహించి, విక్రమార్కునకు బదులు భోజరాజని చేర్చి చదివియున్నాడు. ఇవన్నియు గంతపాఠముగా మాకు వచ్చినవే. మహాకవికృతగ్రంథచోరుఁడగు వీని నీతీరున గౌరవించి, మీయాస్థానకవిసార్వభౌములమగు మాబోంట్ల నిటులఁ జిన్నబుచ్చుటఁ దగువంటి విద్వ

త్ప్రభులకు ధర్మము గాదు. అని వారు పలికినంతనే, కాళిదాసుఁడు రోషస్ఫాయితుఁడై చివాలున పీఠంబుపై నుండి లేచి, భోజరాజుతో నిట్లనియె. ఓమహారాజా! వీరు కవులుగారు. కుకవులు. వీరు పండితులు గారు. దండనార్హులు. వీరిపాపఫలము నేటికి పండి బ్రద్దలైనది. ఏమంటిరేని? వీరిలో నొకఁడేకసంతగ్రాహి. రెండవవాఁడు ద్విసంతగ్రాహి. మూఁడవవాఁడు త్రిసంతగ్రాహి. అందువలన పండితవర్యుఁడెట్టిక్రొత్త శ్లోకము చేసికొనివచ్చినను, నది పూర్వమున్నదే యని బుద్ధికుశలతచే వీరు జెప్పుచు, ననేకమందిపండితులకు దమదర్శనభాగ్యమేనియుఁ గలుగనీయక, వారిని పరిభవించి వచ్చినవారిని వచ్చినట్లే సాగనంపుచుండిరి. ఎందఱెందఱో వ్యయప్రయాసల కోర్చి తమదర్శనము గానక, నిది మన యదృష్టమని వెడలిపోవుచుండిరి. నాకుమాత్రము మీదర్శనభాగ్యము గునా? మాయను మాయచేతనే జయింపవలెనని తలంచి, నేనొక పరమఛాందసుని[illegible]నాశ్రయించితిని. వీరు నారచితము పద్యమొకటి జెప్పుమనిరి. అంత నేను "ఉ[illegible]త్ బకవత్" అను శ్లోకమును జదువగా సభవారందఱు గొల్లున నవ్విరి. [illegible]శ్లోకము [illegible]ంచి వీఁడు పరమమూర్ఖుఁడనియు, నిట్టివానిని రాజుచెంతకుఁ గొంపోయిన, మరల నెన్నఁడును కవీశ్వరులను దీసికొని రావలదని రాజాజ్ఞాపించుననియుఁ దలంచి, నన్ను మీదర్శనమునకుఁ దోడ్తెచ్చిరి. నేను మిమ్ముల దర్శించినతోడనే వీరు కంఠపాఠముగ జేయుటకు వీలులేని కఠినాక్షరములతో మొదటిశ్లోకముఁ జెప్పితిని. ఏకసంతగ్రాహికి నత్తియుండుటచేత నతఁడాశ్లోకమును ధారణ జేయలేకపోయెను. అతనికి రాకపోవుటచేఁ దక్కినయిద్దరకుఁగూడ వచ్చినవి గావు. ఆశ్లోకములుమాత్రము విడిచిపెట్టి ధారణకు సులభముగనున్న "మహారాజశ్రీమన్" అను శ్లోకమునుండి నాలుగుశ్లోకములుమాత్రము కంఠపాఠముఁ జేసి, యిప్పుడవిపూర్వకవివిరచితములని నాకవమానము గలిగింప వీరుయత్నించుచున్నారు.

వీరి రహస్యనాటక మెఱుంగక, దేవరవారు, వీరినెంతయో గౌరవించి పోషించుచున్నారని, గంభీరోపన్యాసముఁ గావించెను. సభ్యులెల్లరు వారి దుర్మార్గమునకుఁ జీ చీయనిరి. రాజేంద్రుఁడు కవిత్రయమును గట్టిగా మందలించి, యిట్టిదెన్నఁడైన మరలఁ జేసినపక్షమున నాయాస్థానమునుండి వెడలగొట్టించెద నని చెప్పి నాఁటికి వారితప్పులెల్ల సైరించెను. కవిత్రయము సిగ్గునఁ దలలు నేల వాల్చిరి. నాఁటినుండి రాజేంద్రుఁడు, కాళిదాసును తనయాశ్రితునిగా భావింపక, పరమదైవస్వరూపముగను, పరమమిత్రునిగను భావించి శరీరములు వేరైనను ప్రాణ మొక్కటిగాఁ దలంచి పరస్పరమైత్రితో మెలఁగుచుండిరి.

---

## అశరీరవాణి.

భోజకాళిదాసు లన్యోన్యభావంబున నొండొరు లొక్కటిగఁ మెలఁగుచుండుట, నాటికవీశ్వరుల ద్వేషానలమును మాత్రము చల్లార లేదు. వారికే దండిభవభూతిశంకరులనియుఁ, గవిత్రయమనియుఁ బేళ్లు. కవిత్రయమునకును కాళిదాసునకును తరచుగా శాస్త్రచర్చలు మాత్రము జరుగుచునే యుండెను. చర్చలందొకప్పుడు కాళిదాసు గెలుచుటయు, మఱియొకప్పుడు కవిత్రయము గెలుచుటయుఁ గలదు. కాళిదాసు గొప్పవాఁడని కొందఱును, కవిత్రయము గొప్పవారని కొందఱును చెప్పుచుండిరి. ఒకనాఁడు భోజమహారాజు నిండుకొలువున సుఖాసీనుఁడై యుండ, శాస్త్రచర్చయందు రెండు తెగలవారికి వివాదము పుట్టెను. ఆ వివాదము మనుష్యమాత్రు లెవ్వరును దీర్ప లేరనియు, సరస్వతీదేవియే యిదమిత్థమని నిర్ణయించుట కర్హురాలనియు, సభాసీనులైనపండితులు పలికిరి. అంతఁ గాళిదాసు దేవీవరప్రభావంబున సరస్వతీదేవి నాహ్వానముఁ జేసి తల్లీ! సరస్వతీ ! మా యీవివాదముఁ బరిష్కరించి పుణ్యముఁ గట్టుకొ

మ్మని వేడుకొనెను. అప్పుడా సభాభవనంబున వాణి యశరీరవాణియై యిట్లని పలికెను.

"కవి ర్దండీః కవి ర్దండీః భవభూతి స్తు పండితః"

తా. దండియే కవి. దండియే కవి. భవభూతియన్ననో పండితుఁడు. అని, శ్లోకమం దర్ధభాగము మాత్రమే చెప్పి యూరకుండెను. దండి కవియనియు, భవభూతి పండితుఁ డనియు శారదాదేవి పలికి, కాళిదాసు ప్రసక్తియే చెప్పకపోవుటచేఁ గాళిదాసుఁడు కవియుఁ బండితుఁడు కూడ కాఁడనియు శత్రుపక్షమువారు పరిహసించి యూరకుండిరి. అంతఁ గాళిదాసు కోపోద్దీపితమానసుఁడై శారదాదేవి నుద్దేశించి "కోహం రండే" నే నెవరినే ముండా యని గద్దించి పలికెను. అప్పుడా శారద "త్వమేవాహం త్వమేవాహం నసంశయః" నీవే నేను నేనే నీవుఁ అని ప్రత్యుత్తర మిచ్చెను. శ్లోకమంతయు నీక్రిందివిధముగ నున్నది.

శ్లో॥ కవి ర్దండీః కవి ర్దండీః భవభూతి స్తు పండితః
కోహం రండే? త్వమేవాహం త్వమేవాహం న సంశయః॥

విద్యాధిదేవతయగు వాణి యశరీరవాణియై "నేనే నీ"వని సభాబృంద మెల్ల వినుచుండఁ బలుకుటచే సభికులును రాజేంద్రుఁడును నిశ్చేష్టులై కాళిదాసువిద్యాప్రభావంబును సరస్వతీసాక్షాత్కారమును మిక్కిలి గొనియాడిరి. దండిభవభూతులకు పరాభవమును, శృంగభంగముగూడ గలిగినది. అశరీరవాణి శంకరునిమాటయే యెత్తలేదు. భోజరాజు కాళిదాసున కక్షరలక్ష లిచ్చి బహూకరించి, నాఁటికిఁ గొలువుఁ జాలించెను.

---

## కాళిదాసుని పరీక్షాశాస్త్రము.

కాళిదాసునకు తర్కవ్యాకరణాదిశాస్త్రములయందుఁ బాండిత్యము లేదనియు, నేవో కొన్నికావ్యనాటకాలంకారములు కంఠపాఠముఁ

జేసి సరసరచనానైపుణ్యము మాత్రమును సంపాదించెననియు, నతని శత్రుకోటి, లోకమునం దొక యపవాద గలిగించిరి. లోకులు కాకులవంటి వారు. కావున మంచిచెడ్డలు విచారించక నిట్టియపవాదములు నిజమని నమ్ముటయు స్వభావసిద్ధమై యున్నది. ఒకనాఁడు ప్రభాకరుఁడను పండితుఁడొకఁడు తాను రచించిన వ్యాకరణశాస్త్రములోని యొకఘట్టములో గొన్ని పత్రములను తీసివైచి, యాపై భాగమునుండి పాఠముఁ జెప్పుకొని రండని తనశిష్యులను కాళిదాసునొద్దకుఁ బంపించెను. దీనితోఁ గాళిదాసుని తెలివితేటలు వమ్ము కాఁగలవని ప్రభాకరుఁ డెంతయు నమ్మియుండెను. శిష్యు లావిధముగనే కాళిదాసుచెంతకుఁ బోయి మాగురువుగారు గ్రామాంతరమున కేగియున్నారు. మీరీదినమున మాకు పాఠములు జెప్పవలయునని, తమగురువుచెప్పినప్రకారముగఁ జదువ నారంభించిరి. వారటులఁ గొన్నిసూత్రములు జదివిన తరువాత సందర్భము కుదురలేదు. అంతఁ గాళిదాసు మధ్యలో గొంతభాగము పోయినదని వారితోఁ జెప్పి యాభాగమును తానే పూరించి చెప్పి పంపెను. శిష్యు లాపూరణభాగమును గొనిపోయి తమగురువుగారికిఁ జూపించిరి. ప్రభాకరుఁ డ్దాని చూచి తనరచనకంటెఁ గాళిదాసవిరచితమే, రసభరితమై యుండుటచేత, నాభాగమునే తనగ్రంథమునఁ జేర్చుకొని "కాళిదాసఘట్ట"మని దానికి పేరు బెట్టెను. ఈసంగతి ప్రభాకరునివలన దేశమంతయు వెల్లడియగుటచేఁ గాళిదాసు సకలశాస్త్రపారంగతుఁడని ప్రతీతి గలిగి మిక్కిలిగా గౌరవింపఁబడుచుండెను.

---

## సమస్యాపూరణము.

విజయవిక్రమసింహుఁడగు భోజుఁడు తనదేశపరిస్థితు లెటులున్నవో కనుఁగొనుటకై రాత్రులయందు మాయావేసములు వేసికొని మంచిచెడ్డలు విచారించి రాజ్యపరిపాలనఁ జేయునని ప్రతీతి కలదు. అట్టి

రాజేంద్రుఁ డొకనాఁడు మాయావేషమున బట్టణమంతయుఁ దిరుగుచు నొకబ్రాహ్మణునియింట బసచేసెను. ఆబ్రాహ్మణుఁడు వేదాధ్యయన సంపన్నుఁడై, నిరంతరము ధూపదీపనైవేద్యములతో భగవదారాధన సేయుచుండువాఁడు. వానియిల్లాలును గృహలక్ష్మియై పతియే పరబ్రహ్మమని నమ్మి వానియనుగులకు మనుగులొత్తుచు, శాంతశమదమాది గుణసంపత్తిచే, నాకలోకమునకుఁగూడ వన్నె గలిగించి కాపురము జక్కఁగా దిద్దుకొనుచుండెను. గృహయజమానుఁడు పగలంతయు నేదో పనిమీఁద వెళ్లి రాత్రివేళ నింటికి వచ్చెను. ఆపతివ్రతామతల్లి, వచ్చిన భర్త కెదురుగాఁ బోయి సకలోపచారముల సేవదీర్చి, యుష్ణోదకముల స్నాన మాడించి, తడి యొత్తి, తృప్తికరముగ భోజనముబెట్టి, తాంబూల మిచ్చి, పాన్పుపైఁ బవళింపఁజేసి, తాను భుజింపకయే, పెనిమిటిపాద ముల నొత్తుచుఁ గూరుచుండెను. కొంతసేపటికి భర్త కన్నులువెట్టుచు నిద్రించెను. అంతలో నామెకుమారుఁడు రెండేండ్లవాఁడు కొంచెము దూరముగానున్న మంచముపై బాఁకుకొని యిటునటు దొర్లుచు నాక స్మికముగ బ్రక్కనున్న కుంపటిలోఁ బడిపోయెను. కన్నకొడుకు నిప్పులలోఁ బడిపోయినను నమ్మహాపతివ్రత కనులారఁ జూచుచు పుత్రవాత్సల్యముఁగూడ విడిచిపెట్టి, యలసిసొలసి వచ్చి నిద్రించుచున్నభర్తకు నిద్రాభంగ మెక్కడ గలుగునో యనుభీతిచే పాదము లొత్తుచు నట్లె కూర్చుండి చూచుచుండెను. కాని, 'నేను నిరంతరము పతిని దైవస్వరూపముగ భావించి పూజింతునేని, పతివ్రత నైతినేని, నాబిడ్డఁడు సజీవియై యుండుఁగాక.' అనుచు నగ్నిదేవుని బ్రార్థించుచు ధైర్యముఁ జిక్కబట్టి యుండెను.

అచ్చోటనే బాటసారివేషముతోనున్న భోజరా జదియంతయు గమనించి, యాశ్చర్యచకితుఁడై తెల్లవారుజామున తనమందిరమునకుఁ బోయెను. మరునాఁడు రాజేంద్రుఁడు సభాభవనంబున సింహాసనాసీనుఁ

దై "హుతాశన శ్చందనపంకశీతలః" అను సమస్య నిచ్చి పూరింపుఁడని, యాస్థానపండితుల నడిగెను. దండిభవభూతిశంకరకవులాదిగా గొందఱు పూరించి వినిపించిరి కాని, సమస్యాపూరణ సరిలేదనుచుండఁ గాళిదాసుఁడు దేవీవరప్రసాదంబున సర్వము గుర్తెఱింగి యాసమస్య నిట్లుపూరించెను.

శ్లో. సుతం పతన్తం ప్రసమీక్ష్య పావకే
న బోధయామాస పతిం పతివ్రతా
తదాఽభవత్ తత్పతిభక్తిగౌరవా
ద్ధుతాశన శ్చందనపంకశీతలః.

తా—కుమారుఁడు నిప్పులకుంపటిలోఁబడుటఁ గన్నులార జూచియుఁ, బతివ్రతాశిరోమణియైన భార్య ధర్మబద్ధయై, భర్తను మేల్కొలుపలేదు. ఆసతీమతల్లి పతివ్రతాప్రభావముచేత నగ్నిదేవుఁడు మంచిగంధమువలెఁ జల్లనై కుమారుని రక్షించెనని భావము.

తద్వృత్తాంతమంతయు రాజేంద్రుఁ డౌననఁగఁ, గాళిదాసుని బుద్ధికుశలతకు సభికులెల్ల రాశ్చర్యనిమగ్నులై మిక్కిలి ప్రశంసించిరి.

---

## కాళిదాసుని విజ్ఞానపాండిత్యము.

సరస్వతీకృపాకటాక్షలబ్ధకవితాధురంధరుఁడగు బాణుఁడను మహాకవి యొకఁ డుండెను. ఈకవిరాజును గుఱించి "బాణోచ్ఛిష్టం జగత్సర్వ" మని యొకలోకోక్తి కలదు. అనఁగా లోక మంత... సమస్తశబ్దాలంకా...

కాదంబరిమాత్రము మిక్కిలి రసవంతమైనది. ఒకనాఁడు బాణుఁడు తన కాదంబరీమహాకావ్యమును జగద్విఖ్యాతకవిశేఖరుఁడగు కాళిదాసునకు వినిపించి, వానియభిప్రాయము దెలిసికొనుటెంతయు నుత్తమం బని తలంచి, యాగ్రంథమును తనశిష్యులచేతి కిచ్చి కాళిదాసునొద్దకు బంపించెను.

శిష్యు లాగ్రంథము నామూలాగ్రముగఁ గాళిదాసునకు జదివి వినిపించిరి. అతఁడాగ్రంథమంతయుఁ జక్కగ నాలించి, గ్రంథము నాకు మత్తు గలుగఁజేసినదని మీగురువుగారితోఁ జెప్పుడు అని వారలఁ బంపించెను. శిష్యు లావిధముగనే గురువునకుఁ జెప్పిరి. బాణుఁ డామాటలు విని నాగ్రంథము రసహీనముగ నుండుటచే నాయనకు నిద్రమత్తు గలుగఁజేసెను కాఁబోలు నని నిరుత్సాహుఁడై, కాళిదాసు మెచ్చని గ్రంథముఁ గాల్పనా ? యని, వికలచిత్తుఁడై, శిష్యులు వలదని వారించుచున్నను వినక నాగ్రంథము హుతాశన కీలల కాహుతిఁ గావించెను.

కొంతకాలమైనతరువాత నొకనాఁడు సభాభవనంబునఁ గాళిదాసుప్రక్కనే బాణుఁడుగూడ గూర్చుండి యిరువురు మాటలాడుకొనుచుఁ బ్రసంగవశంబునఁ గాళిదాసుఁడు "బాణకవీ ! నీవు రచించినకాదంబరి చాలరసవంతముగ నున్నదిసుమా ! మఱియొకసారి వినఁ గుతూహలముగా నున్న"దనెను. ఆమాటలకు బాణకవి నివ్వెరపడి అయ్యో!"నాకాదంబరి [illegible] కలిగించినదని నాశిష్యులతో మీరు జెప్పి పంపగా, పని [illegible] సురామప్రీతి గావించితిని [illegible]

అయినను యిప్పుడు మించిపోయినది లేదు. గ్రంథశ్రవణకాలమం దా గ్రంథ మంతయు నామనస్సున ముద్రితమై యున్నది. నీ వెంతయుఁ జింతింపవల దని, మొదటినుండి చివరవఱకు జదివి వ్రాయించి యిచ్చెను. అంత బాణకవి పరమానందభరితుఁడై కాళిదాసుని యఖండవిజ్ఞానసంపత్తిఁ బొగడుచు వందనశతంబు లాచరించెను.

భవభూతియను మహాకవియు, నుత్తరరామచరిత్రమనునాటకమును రచించి, తానుఁగూడ గాళిదాసమహాకవికి వినిపించి వానియభిప్రాయముఁ దెలిసికొనవలెనని, తనశిష్యుల కాగ్రంథ మిచ్చి పంపించెను. శిష్యులానాటకము జదువుచుండగాఁ గాళిదాసుఁ డాద్యంతమును శ్రద్ధాళువై విని యూరకుండెను. తరువాత శిష్యు లాగ్రంథమును గొనిపోయి భవభూతికి సమర్పింపఁగాఁ గాళిదాసుఁ డేమని చెప్పెనని యడిగెను. ఏమియుఁ జెప్పక నూరకుండె నని వారు చెప్పిరి. తనయభిప్రాయము జెప్పకపోయినను వినునప్పు డాతనినోట మాట లేవైన వెలుఁడెనా యని యడుగఁగా శిష్యులిట్లని చెప్పిరి.

శ్లో. కిమపి కిమపి మందం మంద మాసక్తియోగా
దవిరళితకపోలం జల్పతో రక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రి రేవం వ్యరంసీత్.

అనుశ్లోకమును మేము జదువుచుండగా నతఁడు తాంబూలచర్వణము సేయుచు నాకులకు సున్నమురాయుచున్న దాసిని జూచి సున్న మెక్కువైనదని యనెను. ఇంతకంటె మ రేమియుఁ బలుకలే దనిచెప్పిరి. ఆమాటకర్థమేమైయుండునాయని భవభూతి తనమనంబున జాలవఱకువితర్కించుకొని, శ్లోకముయొక్క చివరపాదములోనున్న "ఏవం" అనుమాటలో సున్న యధికముగ నున్నదను కాళిదాసుని యభిప్రాయ మెఱింగినవాఁడై, "ఏవం" అనుమాటకు బదులుగా "ఏవ" అనిమార్చి, శ్లోకము జదువుకొన రసవంతముగానున్నది.

ఈచరిత్రమునే భవభూతి యొకప్పుడు, నిండుపేరోలగమున భోజరాజునకు వినిపించెను. రాజేంద్రుఁడు కార్యాంతరనిమగ్నుఁడై యుండుటంజేసి సరిగా వినియుండలేదు. గ్రంథము రసహీనముగ నుండుటచేత నే రాజేంద్రుఁడు శ్రద్ధగావినలేదని తలంచి, బాణుఁడు కాదంబరిని చేసినట్లే, తానుగూడ నగ్నిహోత్రున కర్పణముఁజేసెను.

మఱియొకప్పుడు భోజరాజు భవభూతిం జూచి నీయుత్తరరామచరిత్రము మిక్కిలి రసవంతమై శ్రవణానందకరముగ నున్నదె గాని, నాఁడొకకార్యాంతరనిమగ్నుఁడనై యుండుటం జేసి శ్రద్ధగా విననైతిని. మఱియొకసారి వినిపింపుమని యడిగెను. రాజుమాటలకు భవభూతి యదరిపడి తా నొనర్చిన యవివేకకార్యమును దెలిపి చింతాక్రాంతుఁడయ్యెను. రాజును, సభ్యులునుగూడ విచారపడుచుండగా పరశ్రేయోభిలాషియగు కాళిదాసుఁ డాసనమునుండిలేచి, ప్రభూ! మీ రెల్లరుఁ జింతింపఁ బనిలేదు. భవభూతిశిష్యులు చదివినప్పుడే నాకాగ్రంథమంతయుఁ గంఠపాఠమై యున్నదని, నాటకమంతయుఁ దాను జెప్పి వ్రాయించి యిచ్చి భవభూతిమనోరథ మీడేర్చెను. రాజును సభ్యులును, కాళిదాసుఁడు సరస్వతీదేవియవతారమే యని వేనోళ్ళఁ బొగడిరి. కాళిదాసుఁడు, భవభూతివిరచితయుత్తరరామచరిత్రము నీక్రిందివిధముగ నభినందించెను.

శ్లో. కావ్యేషు నాటకే ష్వేవ వయం వా వయ మేవ వా
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే.

కావ్యనాటకములయం దుత్తరరామచరిత్రప్రణేతయగుభవభూతి మమ్ములగూడ నధిగమించెను.

---

నవనవ—పంచపంచ.

కవిత్రయము, తమకు రాజాస్థానమున గౌరవము లేకుండఁజేసిన కాళిదాసు నెటులైనను పరాభవించి మోదించి, మనుపటికంటె

నెక్కుడుగౌరవాతిశయములు భోజరాజువలన సంపాదింపవలెనని,యనేక మారులు కాళిదాసుతో వివాదమునకు డీకొని తలలు నేలవ్రాల్చిరి. కాని, ప్రయత్నము మాత్రము మానలేదు. ఒకరోజున కవిత్రయము సింహాసనాసీనుండైన రాజేంద్రునిం గాంచి ప్రభూత్తమా! వేదమునందు గొన్ని వ్యాకరణఛందోదోషములు గానంబడుచున్నవి. వాటిని దిద్ది సంస్కరించి దోషరహితముం జేయందలంచినట్లు విన్నవించిరి. చేతనైనచో మీ రొనర్పుండని రాజు వచించి యూరకుండెను. బ్రహ్మముఖమునం దావిర్భవించి, యనాదిసిద్ధములైన వేదములం దప్పులు దిద్దుట వీరితరమా? వీరియబ్బతరమా? అని కాళిదాసుడు తనలోం దా నవ్వుకొని మిన్నకుండెను.

అనంతరము దండి భవభూతి శంకరప్రముఖులు, తత్కార్యనిర్వహణమునకు సుముహూర్తము నిశ్చయించి, ముందుగా విఘ్నేశ్వరపూజ నారంభించిరి. ఆసమీపమందున్న వృక్షశాఖపై నొకచిలుక 'కూయుచుండి "నవనవ" యని, కూయసాగెను. శుభకార్యనిర్వహణసమయమునం బులుంగుకూత దుశ్శకున మని తలంచి నాంటి కాకార్యమును విరమించి, మఱియొక శుభదినంబున వేదసంస్కరణ మారంభించిరి. ఆదినముకూడ చిలుక చెట్టుపై గూర్చుండి "నవనవ"యని కూసెను. వెంటనే వా రాపని మానుకొని, వేదసంస్కరణసమయమునకే శుకము వచ్చి "నవనవ" యని కూయుచున్నది. ఇందులకు గారణ మేమై యుండునా యని, పరిపరివిధంబుల వితర్కించుకొనంజొచ్చిరి. కాని, దానియర్థ మెవ్వరికిని బోధపడ లేదు. మూండవపర్యాయముకూడ నట్లే ప్రారంభించుచుండ నెప్పటియట్లాచిలుక "న[illegible] [illegible]దొడంగెను. అంతలోం గాళిదాసుం డక్క[illegible] [illegible]ది, "పంచపంచ" యని యాపక్షి

కవిశ్రేష్ఠులారా! ఈచిలుక సామాన్యమైనదికాదు. తొల్లి వేదములు విభాగించిన వ్యాసభగవానుఁడు శుకరూపమున వచ్చి మనయనో గర్వమును నిర్మూలింప నిట్లు పలుకుచున్నాఁడు. ఏలనన, వేదకాలము నుండియు నేఁటివఱకు కొందఱొందఱో మహానుభావు లీలోకంబున బుట్టి, వేదపారాయణమున నిహపరములు సాధించి కృతార్థులై యుండిరేగాని, మనవలె నహంభావమున వేదములందు దప్పులు దిద్దుటకై యత్నించువాఁడు లెక్కకొక్కఁడైనఁ గానరాఁడు. శ్రీమన్నారాయణస్వరూపుఁడగు బాదరాయణుఁడు చిలుకరూపమున వచ్చి "నవనవ" యని చెప్పుచున్నాఁడు. అందుల కర్థ మేమనఁగా, మీరు తొమ్మిది వ్యాకరణములు చదివి యున్నారా యని ప్రశ్నించుచున్నాఁడు. మన మైదువ్యాకరణములే జదివియుంటిమి. కావున "పంచపంచ" యని నే నుత్తరము జెప్పితిని. మఱియొక విశేష మేమనఁగా మనము తొమ్మిదివ్యాకరణములు జదివి యున్నయెడల నేదోషములు గనిపింపవు. ఐదువ్యాకరణములే యసంపూర్తిగఁ జదివిన మనకు వేదమున దోషములు గన్పట్టుచున్నవి. కావున, నింకనైన నిట్టి యవివేక కార్యములను బూనుకొని పాప మొడిఁగట్టుకొనకుఁడని గట్టిగా మందలించి పంపివైచెను.

---

## బంతియాట.

ఒకప్పుడు భోజనరేంద్రవల్లభుఁడు మారువేషము వైచికొని ధారానగరమునం దిరుగాడుచు నొకవేశ్యాగృహంబున జొచ్చెను. నరేంద్రుఁడు ప్రచ్ఛన్నవేషధారిగా నుండుటచే వేశ్యలు … గముతో దాము
స్వేచ్ఛగా నాటపాటలయందు నిమగ … నిందు
జవ్వనమున వేశ్యాంగన యొక …

రాటగట్టుమొగమును, తూపులఁబోలు చూపులును, జారుపయ్యెద ండి విడివడుచున్న గుబ్బచనుబంతులును, వర్ణనాతీతమై చూపరుల దయమును కొల్లగొట్టుచున్నవి. అదంతయు భూపాలుఁడు తన ాలనేత్రములతో బారజూచి, మొంతయు నాశ్చర్యపడుచు తనముంది నకుఁ బోయి, మఱునాఁడు తన యాస్థానకవిబృందమున కాయుదం దెలియఁబరచి, కందుకక్రీడలాడుచున్న యాపణ్యాంగనను వర్ణింపుఁ కోరెను. అంత భవభూతి యిట్లని వర్ణించెను.

శ్లో. విదితం నను కందుక ! తే హృదయం
ప్రమదాధరసంగమలుబ్ధ ఇవ
వనితాకరతామరసాభిహతః
పతితః పతితః పున రుత్పతసి.

తా. ఓబంతీ ! నీమనోభిప్రాయము తెలిసినది. ఆసుందరాంగి బింబాధరముంబనమునకై యత్నించుచున్నావు. అందువలనఁ గదా ని వ్వాకన్నియ తన కరపల్లవములతో నణఁగఁగొట్టినను మరల మరల నెగురుచున్నావు.

అనంతరము వరరుచి యీక్రిందివిధముగ వర్ణించెను.

శ్లో. ఏకోఽపి త్రయ ఇవ భాతి కందుకోఽయం
కాంతాయాః కరతలరాగరక్తరక్తః
భూమౌ తచ్చరణనఖాంశుగౌరగౌరః
ఖస్థః సన్ నయనమరీచి నీలనీలః.

తా. బంతి [illegible] ను మూఁడుబంతులుగా గనిపించుచున్న ది. ఆ కని [illegible] యొత్తుదనము సోఁకుటచే నెఱ్ఱనై యా [illegible] కాంతిచేఁ దెల్లగా నుండును.

శ్లో. పయోధరాకారధరో హి కందుకః
కరేణ రోషా దభిహన్యతే ముహుః
ఇతీవ నేత్రాకృతిభీత ముత్పలం
స్త్రియః ప్రసాదాయ పపాత పాదయోః.

తా. ఆబంతి తన చనుబంతులతో సమానముగ నున్నదని కాంత మాటిమాటికి జేతితోఁ జరచుచున్నది. బంతికి కలుగుచున్న భవముఁ జూచి, చెవియందున్న నల్లకలువ తనకుఁగూడ కరతాడనము జరుగునేమో యని భయంబునఁ గొట్టవద్దని దానిపాదములపై బడుచున్నదా యను రీతిగ గందుకక్రీడవలన చెవినుండి జారి కాలిముందరఁ బడినది.

భోజుఁడు తన యభిప్రాయానుసారముగ వర్ణించినందునఁ గాళిదాసును మిక్కిలిగా బహూకరించెను.

---

పశ్చాత్తాపము.

కాళిదాసు తీర్థయాత్రలు సేవింపుచుఁ బ్రయాగలోఁ ద్రివేణీసంగమంబున సుస్నాతుఁడై, పుణ్యప్రదంబగు కాశీక్షేత్రమునకుఁ బోయెను. అంత నతండు భాగీరథియందు గ్రుంకు లిడి, విశ్వేశ్వరుని భక్తిపురస్సరముగఁ బ్రార్థించి, యన్నపూర్ణాదేవిపాదపద్మంబులకుఁ బ్రణమిల్లి, శ్రీమన్నారాయణావతారుండగు వేదవ్యాసుని విగ్రహంబుచెంతకుఁ బోయి నమస్కరించి వానిబొడ్డునఁ దన వ్రేలు ద్రొక్కి చకారకుక్షి యని పరిహసించెను. అనఁగా, వ్యాసభ[illegible]మున భారతమును, నష్టాదశపురాణములు[illegible]యందు

బాదరాయణున కెంతయు నాగ్రహముఁ గలుగుటచే, తనబొడ్డులోఁ బెట్టిన కాళిదాసునివ్రేలు యూడిరాదయ్యెను. వేదవిభాగముఁ జేసి, పదునెనిమిదపురాణములు రచించిన యపరావతారుఁడగు వ్యాసమహర్షిని తూలనాడినందువలన నా కీశిక్ష విధించినాఁడని, కాళిదాసుఁడు మిక్కిలి పశ్చాత్తాపముఁ జెంది, భక్తివినయములతో నమ్మహానుభావు నిట్లని స్తుతించెను.

శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.

తా. వసిష్ఠుని మునిమనుమఁడును, శక్తిమునీశ్వరుని మనుమఁడును, పాపనాశనుఁడును, పరాశరపుత్రుండును, శుకునితండ్రియు తపోబలసంపన్నుఁడు నైన వ్యాసమూర్తికి నమస్కరించుచున్నాను.

శ్లో. అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభు,. ర్భగవా న్బాదరాయణః.

తా. భగవదంశసంభూతుఁడగు బాదరాయణుఁడు, నాలుగు మొగములులేని బ్రహ్మదేవుఁడు. రెండుచేతులు గల విష్ణుదేవుఁడు. మూఁడవకన్ను లేని మహేశ్వరుఁడు. అనగా త్రిమూర్తులను బోలఁడు గాని, మహిమయందు వారితో సమానుఁడే యని భావము.

పై రెండుశ్లోకములకు వ్యాసుఁ డానందపారవశ్యంబున సాక్షాత్కరించి, వత్సా! కాళిదాసా! నీరచనానైపుణ్యమునకును, గురుభక్తికిని సంతసించితి [illegible] యని న న్నాక్షేపించితివి. కావున, నీ [illegible] ండవులు ద్రౌపదికి భర్తలై,

శ్లో. ద్రౌపద్యాః పాండుతనయాః పతి దేవర భావుకాః
న దేవరో ధర్మరాజ స్సహదేవో న భావుకః.

తా. పాండవులు ద్రౌపదికి భర్తలు, బావలు, మఱఁదులు. ధర్మరాజెన్నఁడు మఱఁది కాఁడు. సహదేవుఁడెన్నఁడు బావ కాఁడు.

వ్యాసభగవానుఁ డాశ్లోకము విని సంతోషితస్వాంతుఁడై, వత్సా! నీపశ్చాత్తాపమే నీకు కవితారక్షమై వరలుఁగాక. నీకవిత్వ మాచంద్రార్కము వర్ధిల్లుగాక అని దీవించెను.

---

## అమావాస్య పూర్ణిమ యగుట.

భోజధరణీవల్లభుఁ డొకనాఁడు నిండుకొలువున సుఖాసీనుఁడై కాళిదాసా! నేఁడు తిథి యేమని యడిగెను. అప్పుడు కాళిదాసుఁ డేదో రచనయందు నిమగ్నుఁడై యున్నకతన, నమావాస్యయనుటకు బదులు పొరపాటున పూర్ణిమ యని చెప్పెను. సమీపమందున్న కవులు నేఁ డమావాస్య కాదా! యని యడిగిరి. కాళిదాసుఁ డందుల కెంతయు నొచ్చుకొని, తా నన్నమాట జరిగి తీరవలెనను పట్టుదలఁ గలవాఁడగుటచే నీశ్వరీవరప్రసాదము గలదుగదాయను ధైర్యోత్సాహము గలవాఁడై, "అవును. నేఁడు పూర్ణిమయే. అమావాస్య కాదు." అని గంభీరముగఁ బలికెను. అంత నరేంద్రుఁడు, కాళిదాసా! నేఁడు పూర్ణిమ యైనపక్షమున వెన్నెలగాయునా? అని ప్రశ్నించెను. అవును. నేఁడు చంద్రోదయ మగును. పండువెన్నెల [illegible]సిన ట్లుండును. అని దృఢముగ బలికెను. సరే అట్లు [illegible] రాజు వానికి సెలవిచ్చి పంపించెను.

నేఁడు నాపరువు దక్కించి, కాళిదాసుఁడనుపేరు చిరస్థాయిగ నిలుపు మని ప్రార్థించెను. అప్పుడు భక్తాభీష్టప్రదాయిని యగు భువనేశ్వరి తన కృపాకటాక్షవీక్షణము లతనిపైఁ బఱపి వత్సా! భయంబుడుగుము. నీమాట దక్కించెద నని యభయ మిచ్చి తనకర్ణభూషణము నొసంగి, సాయంతనమున దీని నంబరవీథి కెగురవేయు మని యాజ్ఞాపించి పంపివైచెను. భువనేశ్వరి తనయందుఁ గృపామతియైనందుల కెంతయు నానందించుచుఁ గాళిదాసు నిజగృహంబునకరిగి సూర్యాస్తమయమైనతోడనే దేవి నారాధించుచుఁ గర్ణభూషణ మాంబరవీథి కెగురవైచెను. అది నింగి కేగి పూర్ణచంద్రునివలెఁ బ్రకాశించుచుండెను. ఆవిచిత్రదృశ్యమును జూచి రాజును పురజనులును కాళిదాసుని ప్రభావమునకు నాశ్చర్యపడి మిగులఁ గొనియాడిరి.

---

## చంద్రవర్ణనము.

ఒకనాఁడు భోజక్షితిపాలుఁ డరణ్యమునకు వేఁటకుఁ బోయి మిక్కిలి శ్రమకలిగి యుండుటచే నొకతటాకముచెంత విశ్రమించెను. అంతఁ గ్రమక్రమముగ నభోమణి పశ్చిమాంబుధిలోఁ గ్రుంకెను. నాఁడు పౌర్ణమి యగుటచే శీతమయూఖుఁడు తనషోడశకళలతోఁ దూర్పున నుదయించి జగదానందసంధాయకుండై వెలుఁగొందుచుండెను. ఆవెన్నెల

శ్లో. "చరమగిరినితంబే చంద్రబింబం లలంబే"

దానిని భవభూతి యీక్రిందివిధముగఁ బూరించెను.

'చలతి శిశిరవాతే మందమందం ప్రభాతే'

దానినే కాళిదాసుఁ డిట్లని పూరించెను.

'యువతిజనకదంబే నాథముక్తోష్ఠబింబే'

చరమగిరినితంబే చంద్రబింబం లలంబే

తా—పశ్చిమశిఖరాగ్రమునఁ జంద్రుఁడు వ్రేలాడుచుండెను. ప్రభాతకాలమునఁ జల్లనిపిల్లగాడ్పులు వీచుచుండె నని (భవభూతి పూరించెను.)

పడుచుకాంతల యధరాధరంబులను భర్తలు విడుచుచుండగా నని (కాళిదాసు పూరించెను.)

భవభూతివర్ణనముకంటెఁ గాళిదాసుపూరణ మధికోత్సాహముగ నుండుటచే రాజు వానినే మిక్కిలి బహూకరించెను.

---

జూదమునందు విరక్తిఁ గలిగించుట.

లోకంబున నెంతటిసర్వసద్గుణసంపన్నునికైన నేదో యొక దుర్గుణ ముండుట సహజము. అనగా గులాబిపుష్పమునకు ముండ్లువలెను, చంద్రునకు కళంకమువలెను, జగత్ప్రసిద్ధిఁగాంచిన శ్రీభోజమహారాజునకు

భార్యాసమేతుఁడై వనములఁ గ్రుమ్మరుచు, నాఁకటిచిచ్చుచే దహించుకొనిపోవుచు భార్యను విడిచి యేకాకియై పోయెను. అనంతరము వెనుక తనకు సామంతరాజయిన ఋతుపర్ణునివద్ద విరూపముతో వంటలవాఁడుగ సేవఁజేసెను.

రాజసూయాధ్వరంబున సకలరాజన్యుల గెలిచి, భూచక్రమెల్లఁ బరిపాలనజేసిన ధర్మరాజు—నిత్యసత్యవ్రతుఁడైనధర్మరాజు—జూదమునం దనురక్తిగలవాఁడై నలుగురుతమ్ములను, భార్యను, తానును, రాజ్యసర్వస్వముతోఁగూడ జూదమునం దోటుపడియె కట్టుగుడ్డలతో నట్టడవులఁ జేరి పలుకష్టములకు లోనైన సంగతులు మీరెఱింగినవే. తనుబోంట్లకు నేను చెప్పఁదగినవాఁడను కాను గాని, నాయందు మీకుగల యవ్యాజానురాగంబు పెంపున నింతగా మీకు విన్నవించుకొనుచున్నాను. కావున మీరు ద్యూతప్రసక్తి మానవలయు నని యనేకతెఱంగుల బోధించినను, రాజేంద్రుఁ డన్నియుఁ బెడచెవిని బెట్టి జూదమాడుట మాత్రము మానలేదు. అంతఁ గాళిదాసుఁ డొకయుపాయముఁ బన్ని, యొకబౌద్ధసన్యాసిని బిలిచి 'భోజరాజు ద్యూతగృహంబునకుఁ బోవుసమయమున నీవు మాంసపుదుకాణము దగ్గర మాంసముఁ గొనువానివలె నుండు' మని, మఱికొన్ని రహస్యోపాయములు వానికిఁ దెలియఁబఱచి పంపించెను. భిక్షుకుఁ డట్లె మాంసపుదుకాణముదగ్గర బేరమాడుచుండెను. అప్పుడా దారినిబోవుచున్నభోజరాజు వానిం జూచి యిట్లని భాషించెను.

భోజ—భి[illegible]వణం కి ముచితమ్ ? = ఓయిభిక్షు
[illegible]వచ్చునా ?

భిక్షు—ప్రియ మహెూ! వారాంగనాభిస్సహ = భోగమువాళ్ళతో గలిసినప్పు డది మిక్కిలిప్రియము.

భోజ—వారస్త్రీరతయే కుత స్తవ ధనం ? = భోగమువాళ్ళ గూడుటకు నీకు ధన మెక్కడిది ?

భిక్షు—చౌర్యేణ ద్యూతేన వా = దొంగతనమువల్లగాని, జూదమువల్లగాని.

భోజ—చౌర్యద్యూతపరిశ్రమోస్తి భవతాం ? = దొంగతనము జూదమునందు గూడ మీకు ప్రవేశముగలదా ?

భిక్షు—భ్రష్టస్య కా వా గతిః = చెడిపోయినవాని కింకేమిగతి యున్నది ?

ఆశ్లోక మీతీరున నున్నది.

శ్లో. భిక్షో! మాంసనిషేవణం కిముచితం ? కిం తేన మద్యం వినా
మద్యం చాపి తవ ప్రియం ప్రియ మహో! వారాంగనాభి స్సహ
వారస్త్రీరతయే కుత స్తవ ధనం ? చౌర్యేణ ద్యూతేన వా
చౌర్యద్యూతపరిశ్రమోస్తి భవతాం భ్రష్టస్య కా వా గతిః.

ఆ సార్ధగర్భితమగు చమత్కారహితోపదేశ మాలించిన భోజరాజు జూదమువలన సర్వాపత్తు మగునని గ్రహించి నాఁటినుండి ద్యూతప్రసక్తియె లేక, తనకు జూదమునందు విరక్తిఁగలిగింపఁబన్నిన కాళిదాసున కెంతయుఁగృతజ్ఞుఁడై యుండెను.

---

కౌజుప్రల మూర్ఖ...

నిరుపేదయు, నిరక్షరకుక్షి ... కుటుంబ

భారముననే దినదినము ... గా

యాశతో ధారానగరంబునకుఁ జని కాళిదాసుని దర్శించి నమస్కరించెను. ఆకవిరాజు వాని నాదరించి నీవు వచ్చినపని యేమని యడిగెను అప్పు డావిప్రుఁడు చేతులు జోడించుకొని, యోపుణ్యాత్మా! నేను కుచేలునివంటి దారిద్ర్య మనుభవించుచున్నాను. రాజేంద్రునితోఁ జెప్పి నా కుటుంబభారనిర్వహణమున కేదేని సహాయముఁ జేయింప మీరు సమర్థులని మి మ్మాశ్రయించితి నని దీనాననుఁడై వేఁడుకొనెను. నీ కేమైనఁ గవిత్వము వచ్చునా యని కవి యడుగ, నక్షరజ్ఞానమే నాకు లేదని యతఁడు విన్నవించుకొనెను. కవిశేఖరుఁడు వానిదీనావస్థ కెంతయు జాలి నొంది, అయ్యా! నాశక్తివంచన లేకుండ సాయముఁ జేయఁ బ్రయత్నించెద. మీరు చేయునది రాజదర్శనము కావున, నేదియో ఫలమో, పుష్పమో మీకుఁదోచినకానుక దీసికొని రేపు రాజద్వారమునొద్ద వేచి యుండుడు. అనిచెప్పి పంపించెను.

కాసుకేనియు గతిలేని యాబ్రాహ్మణుఁ డెట్టులో గష్టపడి చెఱకుగట్టె నొకటి సంపాదించి, దానిని చిన్నముక్కలుగా చేసి వాటిని తన కొల్లాయగుడ్డను గట్టుకొని రాజదర్బారుసమయమునకుఁ బోయి సింహద్వారముచెంతఁ గూర్చుండెను. దరిద్రునకు నిరంతరపెన్నమ్ము తోడునీడగా నుండును గావున, కొలదిసేపటికే నిద్రాధిదేవత వాని నావేశింపఁ జెఱకుగడలమూటఁ దలక్రిందఁ బెట్టుకొని గుఱ్ఱుపెట్టుచు నిద్రబోయెను. వానికంటె నిత్యదరిద్రుఁ డెవఁడో వానితలక్రిందఁ బెట్టుకొనిన చెఱుకుమూటను జూచినవాఁడై నెమ్మదిగా సంగ్రహించి, వాటికి బదులుగా కాల్చి యార్పిన కొఱవులు మూటగట్టి, యెప్పటియట్లు వానితలక్రిందఁ బెట్టి వెడలిపోయెను.

కాళిదాసుఁడు సభాభవనముఁ బ్రవేశించి, హాజారముకడ మానవ్రతుఁడైన యొకపండితుఁడు తమదర్శనాభిలాషియై వేచియున్నాఁడని రాజుగారితో విన్నవించెను. వెంటనే వానిం బ్రవేశపెట్టుమని రాజు సేవ

కున కాజ్ఞాపించెను. ద్వారపాలకుఁడు పోయి గాఢనిద్రాముద్రితుఁడై యున్న యాబ్రాహ్మణుని మేలుకొలిపి, రాజదర్శనార్థమై వచ్చినవారు మీరేనా? యని ప్రశ్నించెను. అప్పుడు యతఁడు తలయూపఁగా వెంటఁబెట్టుకొని రాజసన్నిధానమునకుఁ గొంపోయెను. నిద్రామైకమున తనయంగవస్త్రపుకొంగున నున్నవి చెఱుగునముక్కలతే యనుభావముతోఁ జూచుకొనక, రాజేంద్రునకు సాష్టాంగవందనము లాచరించి కట్టు విప్పి యాకొఱవులఁ జేతికిచ్చి, యూరకుండెను.

భోజుఁ డాకొఱవుల నందుకొని విస్మితుఁడై కాళిదాసువైపు జూచెను. కాళిదాసుఁడుకూడ మిక్కిలి యాశ్చర్యపడి, యమంగళమును, నశుభసూచకము లైనకొఱవులు రాజేంద్రునిహస్తములఁ బెట్టినబ్రాహ్మణుని యవివేకమును, తా నిప్పుడు సమర్థింపఁజేసిన నతఁ డుభయభ్రష్టుత్వ మగుటగాక, రాజకోపాగ్ని కింధన మగునని యోచించి, భువనేశ్వరి పాదపద్మములు తనమనంబున స్మరించి, రాజేంద్రునితో నిట్లని విన్నవించెను.

భోజమహారాజా! ఈబ్రాహ్మణుఁడు కొఱవులు కానుకగా సమర్పించినందులకు మీరు విభ్రాంతు లగుచుఁ గోపింపవలదు. ఫలమో, పుష్పమో తమవంటివారికి కానుకగా నిచ్చుట ధర్మమని యీబ్రాహ్మణుఁ డెఱుఁగకపోలేదు. వీనిలో గంభీరమైన భావార్థ మున్నది. అవధరింపుఁడు.

శ్లో. దగ్ధం ఖాండవ మర్జునేన చ వృథా దివ్యైర్ద్రుమై ర్భూషితం
దగ్ధా వాయుసుతేన హేమరచితా లంకాపురీ స్వర్గభూః
దగ్ధ స్సర్వసుఖాస్పద శ్చ మదనో హాహా! వృథా శంభునా
దారిద్ర్యం ఘనతాపదం భువి నృణాం కేనాపి నో దహ్యతే.

తా. రమ్యవృక్షములచే నలంకరింపఁబడిన ఖాండవవనము నిష్కారణముగ నర్జునునిచేఁ గాల్పఁబడెను. స్వర్గలోకమై, సువర్ణమయమైన లంకానగర మాంజనేయునిచే దహింపఁబడెను. సకలప్రాణులకు సుఖప్ర

దుండగు మన్మథుఁడుకూడ వ్యర్థముగా నీశ్వరునివలన దగ్ధమై పోయెను. కాని, మానవులఁబట్టి పీడించుచున్న యీదారిద్ర్యము నెవ్వరు దహింపలేకపోయినది. కావున జగద్విఖ్యాతవిరాజమానుఁడవగు మహారాజా! నీవైన మాదారిద్ర్యము నీకోపాగ్నితో గాల్చివేయుమని యీపారుఁ డర్థించుచున్నాఁడు. అని, రాజును, సభ్యులు నాశ్చర్యవిభ్రమాన్వితు లగునటుల సమర్థించెను. రాజేంద్రుఁ డెంతయు సంతోషించి, యాబ్రాహ్మణునకు ధనాము లిచ్చి పంపించెను.

---

టం, టం, టం, టం, టం.

జగన్మోహనాకారుఁడగు భోజరాజేంద్రుఁ డొకనాఁడు స్నానము జేయుచుండఁగా, జవ్వనియగు దాసి యొకతె వానివయోరూపలావణ్యాదులఁ గాంచి, మోహపరవశత్వంబునఁ దనచేతనున్న పాత్రను మేడమెట్లమీఁద జారవిడిచెను. అది మెట్లనుండి 'టంటంటంటంటం' అనుశబ్దముతోఁ గ్రిందకు దొర్లిపోయెను. స్నానానంతరము భోజుఁడు సభావేదిక నలంకరించి, "టంటంటటటంటంటటటంటటటంటం" అనుసమస్య నిచ్చి, పూరింపుఁ డని పండితబృందమునకు ననుజ్ఞ నిచ్చెను. ఆ సమస్యార్థముఁ దెలియక పండితు లెల్ల రొకరిమొగ మొకరు జూచుకొనుచు నూరకుండిరి. దేవీవరప్రసాదుఁడగు కాళిదాసుఁ డద్దానిరహస్యము గ్రహించినవాఁడై యిట్లని పూరించెను.

శ్లో. రాజాభిషేకే మదవిహ్వలాయాః
హస్తా[redacted]ఘటో యువత్యాః
సోపానమార్గేషు కరోతి శబ్దం
టంటంటటంటంటటంటటంటంటం.

రాజేంద్రుని స్నానసమయమునందు, మోహవివశయైన దాసి తన చేతనున్న బంగారుకలశము జారవిడుటచే, సోపానమార్గముగుండ 'టంటంటంటటంటంటంటటటంటటంటం' అని శబ్దము చేయుచు క్రిందబడెను.

కాళిదాసుని ప్రజ్ఞావిశేషంబునకు, రాజెంతయు సంతోషపారవశ్యుఁడయ్యెను.

---

## నీటిలో రాతిపలక.

ఒకనాఁడు పల్లెవాండ్రు నదిలో చేపలఁ బట్టుచుండఁగా నొక రాతిపలక దొరకినది. అందుపై నేదో వ్రాసియుండెను గాని కొన్ని యక్షరములుమాత్రము చెరిగిపోయి స్పష్టముగ గానుపించుటలేదు. అట్టిరాతి శిలాపలకమును బెస్తవాండ్రు పాఱవేయుటకు మనసొప్పక భోజరాజేంద్రుని సన్నిధానమునకుఁ గొనితెచ్చి సమర్పించిరి. ఆశిలాఫలకమును భోజుఁడు నిదానించిచూచి దానిమీఁద లక్కపోత పోయింపగా శ్లోకములో సగభాగము మాత్రమే దొరకెను. ఆశ్లోక మిట్లున్నది.

శ్లో. అయి ఖలు! విషమః పురాకృతానాం
భవతి హి జంతుషు కర్మణాం విపాకః.

తా. జంతువులయందు దొల్లి జేయఁబడినకర్మలయొక్క విపాకము విషమమై యుండునుగదా.

భోజుఁ డాశ్లోకార్థ మెఱింగి తనమనమున నిట్లని వితర్కించుకొనఁ దొడఁగెను. నదిలో వ్రాఁతశిలాఫలక ముండుట కేమిహేతువై యుండవచ్చును? తొల్లి శ్రీయాంజనేయుఁడు తా నొకరామాయణము రచించి, యద్దానిని రాతిపలకలమీఁద వ్రాసి, శ్రీరామమూర్తికి వినిపించె ననియు, రామచంద్రుఁ డదియంతయుఁ జక్కగ విని, చిఱునవ్వు నవ్వుచు, నాంజనేయా! గ్రంథమున నీప్రజ్ఞ లే యుక్కపగ జెప్పుకున్నావే యని, రాముఁ డన్నాడనియు, రామచంద్రపరబ్రహ్మము మెచ్చనిగ్రంథము గ్రంథముగాదని, హనుమతుఁడు వాటినెల్ల సముద్రమునఁ బాఱవైచెనని పెద్దలు చెప్పుకొనుచుండఁగా వినియుంటిని. ఇది వాటిలో నొకటై యుండవచ్చును. ఇందు రెండుపాదములు మాత్రమే కనఁబడుచున్నవి. మిగత

రెండుపాదము లెవరిచేతనైనఁ బూరింపఁజేయుట మంచిదని తలంచి, కొలువుకూటమున కేగి, శ్లోకపూర్వార్థ మిచ్చి దానికి యుత్తరార్థము పూరింపుఁడని భవభూతితోఁ జెప్పెను. భవభూతి యీక్రిందివిధముగఁ జెప్పెను.

క్వను కుల మకలంక మాయతాక్ష్యాః
క్వ చ రజనీచరసంగమాపవాదః.

తా. నిష్కళంకమైన సీతాదేవివంశ మెక్కడ? రావణాసురుని సంగమునయ్యె నను నపవాద మెక్కడ?

భవభూతి పూరించిన శ్లోకభావము రాజునకు తృప్తికరముగ లేక పోవుటచేతఁ దానుగూడ కవియగుటచే నిట్లు రచియించెను.

క్వ జనకతనయా క్వ రామజాయా
క్వ చ దశకంధరమందిరే నివాసః.

తా. జనకరాజేంద్రుని కూఁతురును, రామున కర్థాంగియు నైన సీత యెక్కడ? రావణుని గృహమున నివసించు టెక్కడ?

తనరచనయుఁ దనకు నచ్చకపోవుటచేతఁ, గాళిదాసును పూరింపుమని చెప్పెను. అతఁ డీక్రిందివిధముగ రచించెను.

శివశిరసి శిరాంసి యాని రేజుః
శివశివ! తాని లుంఠతి గృధ్రపాదైః
అయిఖలు విషమః పురాకృతానాం
భవతి హి జంతుషు కర్మణాం విపాకః.

తా. ఏతలలు శివునితలయందుఁ బ్రకాశించెనో, యట్టితలలు గ్రద్దలపాదములతో శివశివ! నేఁడు దొర్లాడుచున్నవిగదా!

కాళిదాసుపూరణ రాజు విని, కవివిరచితముగూడ నట్లేయుండు నని పలికెను. ఆమాటలకు కాళిదాసుని శత్రుపక్షమువారు, 'కవిహృదయ మది కా' దని వాదించిరి. సందియనివృత్తికై రాజేంద్రుఁడాశిలా

ఫలకముమీఁద మరల లక్కపోతపోయించి, యెంతో శ్రమపడి మిగిలినరెండుపాదములు గనిపించునటులఁ జేసి, చదువఁగా, కాళిదాసుఁడు పూరించినట్లే యున్నది. అంతఁ గాళిదాసుని కవితామహత్మ్యమునకు రాజును బండితపామరులుగూడ నాంజలి ఘటించి యభినందించి పారితోషికముల నొసంగిరి.

---

## ఛాందసబ్రాహ్మణులు.

కర్మకాండలు జరుపు ఛాందసబ్రాహ్మణు లిరువురు భోజరాజును దర్శించి, యేదోవిధముగ బహుమానము సంపాదింపవలె నని తలంచి, ధారానగరంబునకుఁ బోయి విచారింపఁగ, కవిత్వముఁ జెప్పినఁ గాని కాసులు రాల వని పురజనులవలనఁ దెలిసికొనియు, మూర్ఖపుపట్టుదలఁ గలవారై, యెట్లో రాజేంద్రుని దర్శించి, వారిలో నొకఁడు 'అణో రణీయా న్మహతో మహీయాన్' అని యొకశ్లోకపాదమును జదివెను. రెండవవాఁడు 'యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్,' అని చదివెను. ఇట్లు వారిరువురు వేదమంత్రములలో నొకశ్లోకమును చెప్పి పిమ్మట నోరు గదల్పలేక మిన్నకుండిరి. ఛాందసపుబ్రాహ్మణులుగదా యని రాజు కనికరించి తోఁచినబహుమానము వారికిచ్చి పంపివైచెను. పిమ్మట రాజేంద్రుఁ డాస్థానంబునకుఁజని, యారెండుపాదములనిచ్చి, శృంగారరసముతో శ్లోకముఁ బూరించుఁ డని యాస్థానకవులతోఁ జెప్పెను. కాని, కవులందఱు దానిం బూరింపలేక మౌనము దాల్చిరి. అంతఁ గాళిదాసుఁ డీక్రిందివిధముగఁ బూరించెను.

శ్లో. అణో రణీయా న్మహతో మహీయాన్
మధ్యో నితంబ శ్చ యదంగనాయాః
తదంగహారిద్రనిమజ్జనేన
యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్.

తా. ఏకాంతయొక్క నడుము, రేణుపుకంటెఁ జిన్నదియై, కటిప్రదేశము మహాగొప్పదియై యుండునో, యాజవ్వనియొక్క మేనిపసుపుతో దడిసిన జందెము మిక్కిలి పరిశుద్ధమైనది.

అని, శృంగారస ముట్టిపడగ రచించిన కాళిదాసునకు రాజు గొప్పగా బహూకరించెను.

---

## బ్రహ్మరాక్షసుఁడు పలాయనమగుట.

భోజభూపాలుఁడు విలాసముగ గాలముఁ గడుపుటకు తన యుద్యానవనమం దొకరమణీయమైన భవనముఁ గట్టించెను. గృహప్రవేశము గాకముందే యొకబ్రహ్మరాక్షసుఁ డాసుందరమందిరంబునఁ బ్రవేశించెను. ప్రతిరాత్రియు నాగృహమునం దెవ్వఁడు పఱుండునో, వాని యొద్దకుఁ బోయి, పాణిని రచించిన వ్యాకరణశాస్త్రమునందలి సూత్రములు నాలుగు, నాలుగుజాములు జదివి వాటికి సముత్తర మిమ్మని యడుగును. వానికోరికప్రకారము సమాధానముఁ జెప్పలేని వానిం జంపి తినుచుండుట వాడుక యైనది. రాజేంద్రుఁడు దేశదేశములనుండి మహామంత్రవేత్తలను రావించి, వానిని బారగొట్టవలెనని విశ్వప్రయత్నము జేసెను. గాని, వచ్చిన మంత్రవేత్త లందఱును, రాక్షసుఁడు తన పొట్టఁబెట్టుకొనుచుండెను. రాజునకు ప్రాణము విసిగి, యామందిరమును గూడ విరక్తిగలిగినవాఁడై, దేవివరప్రసాదుఁడగు కాళిదాసునిఁ బిలిపించి యావద్వృత్తా ... చి, యెట్లైన రక్కసునిఁ బాఱ ద్రోలి ... వైను. 'రాజేంద్రా! అతఁడు

రాక్షసుఁ డెప్పటివలెనే కాళిదాసును సమీపించి 'సర్వస్యద్వే' అను సూత్రమును జదివెను. వెంటనే కాళిదాసుఁడు 'సుమతికుమతీసంప దాపత్తి హేతూ' అని జవా బొసంగెను. రాక్షసుఁడు రెండవసారి వచ్చి 'వృద్ధోయూనా' అను సూత్రమును జదివెను. వెంటనే కవిచంద్రుఁడు 'సహపరిచయాత్ త్యజ్యతే కామినీభిః'అనిపూరించెను. రక్కసుఁడు మూఁడవసారివచ్చి 'ఏకోగోత్రే' యను సూత్రమును పఠించెను. అప్పుడు కాళిదాసుఁడు 'ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి'అనిచెప్పెను. దైత్యుఁడు మరలవచ్చి 'స్త్రీ పుంవచ్చ' యనుసూత్రమును జదివెను. కవిరాజు 'ప్రచరతి గృహే తద్ధి గేహం వినష్టం' అని పూరించెను. తనకోరికప్రకారము కవిసార్వభౌముఁడు సరిగా ప్రత్యుత్తర మిచ్చుటచేత రక్కసుఁడు మిక్కిలి సంతసించి, కాళిదాసుని ప్రేమాలింగనముఁ జేసికొని, వత్సా! నీప్రజ్ఞావిశేషంబుల కెంతయు నానందించితిని. వలయు వరములు కోరుకొనుము. ఇచ్చెద నని చెప్పెను అంతఁ గాళిదాసుఁడు ఓదానవేశ్వరా! మా భోజమహారాజు మిక్కిలి మక్కువతో నీమందిరముఁ గట్టించుకొని యున్నాఁడు. నేటినుండి నీ వీగృహంబును వదలి పోయితివేని, నీవు నాకు వేయివరము లిచ్చినట్లే తలంచెద నని చెప్పెను. అట్లే చేసెద నని రాక్షసుఁ డావెంటనే భవనమునుండి పలాయనమయ్యెను. ఈవృత్తాంతము రాజన్యుఁ డాలించి, కాళిదాసమహాకవిని గాఢాలింగనము జేసికొని, ధనకనకవస్తువాహనాదు లిచ్చి గౌరవించి, శుభముహూర్తంబునఁ గాళిదాసునసమేతముగ నాగృహమునఁ బ్రవేశించి సుఖముగా నుండిరి.

పూర్వశ్లోకమిట్లున్న

'ఏకో గోత్రే ప్రభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తి
'స్త్రీ పుంవచ్చ' ప్రచరతి గృహే తద్ధిగేహం వినష్టమ్.

ఈశ్లోకమునకు వ్యాకరణసంబంధము కనర్థములు వేఱు. వాటికే యిహసంబంధమైన యర్థములు గలవు. కాళిదాసుపూరణము రెండవ యర్థముగుట నీక్రిందివిధముగ నున్నది.

తా. ప్రతివానికి సంపదకుఁ గారణమైన సద్బుద్ధియు, నాపదకు గారణమైన దుర్బుద్ధియు నని రెండుండును. యన్వయుక్తైనవానితో నేస్తము గలిగిన కాంతచేత, ముసలివాఁడు విడువఁబడును. ఎవఁడు కుటుంబభారమును నిర్వహించునో, యాతఁ డొక్కడే గోత్రోద్భవుడు. ఏ కాంత పురుషునివలెఁ దిరుగుచుండునో యాగృహము నశించిపోవును.

---

కాళిదాసుని యుక్తిప్రయుక్తులు.

విదర్భపురంబునఁ గవీశ్వరుఁ డొకఁడు శారదాదేవి నారాధింప నాదేవి ప్రత్యక్షమై, వానికోరిక ప్రకారముగ నొకఢక్క యిచ్చెను. అతఁడా ఢక్కవాయించి, పండితులతో వివాదమునకు దీకొన్న యెడల, నెట్టిపండితుఁడేనియు వానిముందు నోరెత్తఁ జాలఁడు. అందువలన నాతనికి "ఢక్కాకవి" యని పేరు గలిగెను. అతఁడు నాఁటనుండి యనేకదేశములు దిరిగి రాజాస్థానపండితుల నెల్లర నోడించి, విద్యాఘనంబుల రెండింటియందు వీనిని మించినవారు లేరని జగత్ప్రసిద్ధిఁ గాంచి యుండెను.

ఒకనాఁడు ఢక్కాకవి, కవిబ్రహ్మయగు కాళిదాసుని ప్రభావము వినియున్నవాఁడై, వానినెటులయిన జయింపవలెనని తలంచి, ధారానగరంబునకుఁ బోయి యొకసత్రంబున నివసించెను. ఢక్కాకవిరాకయు, వాని కృత్రిమవిజయపాండిత్యమును కాళిదాసుఁ డెఱింగినవాఁడై, వానితో వివాదమున కియ్యకొనక, నొకకూలివాని వేషముతో నాతనియొద్దకుఁ బోయి నమస్కరించి ఓ మహానుభావా! నా కొక సందేహము గలిగి

యున్నది. అట్టికి నీతనువంటివారి నాశ్రయించినఁగాని సంశయనివృత్తి గాదని తమ్ము దర్శించితిని. అది యెట్టిదనఁగా, తెల్లవారుచున్నప్పుడు కాకులు 'కాకా' యని యేలకూయునో చెప్పవలయునని విన్నవించెను. ఢక్కాకవి, యాప్రశ్న నాకుఁదెలియదని చెప్పెను. అంతటఁగాళిదాసుఁడు, దేవా! పోనిండు. నాకుఁ దోచినది చెప్పెదను వినండి! అని యీక్రింది విధముగఁ జదివెను.

శ్లో. వయం కాకా వయం కాకాః కిం రటంతీతి వాయసాః
తిమిరారి స్తమో హంతి శంకయాతంకమానసాః.

తా. కాకులు కాకా యని యెందుల కఱచుచున్న వనఁగా, సూర్యుఁడు చీఁకటులను నశింపఁజేయుచున్నాఁడు. మేముకూడ నల్లగా నుండుటవలన, నవియుఁగూడఁ జీఁకటులే యనుకొని, మమ్మునయితము నాశనముఁ జేయునేమో యనుభయమున మేము చీఁకటులముకాదు. కాకులముసుమా! మా తెరవు రావలదని సూర్యునితో మొఱఁబెట్టుకొనుచున్నవి.

ఆ కూలివాఁడు చెప్పినశ్లోకము వినఁగానే ఢక్కాకవిగుండె ఢక్కుమని, ధారానగరమందలి కూలివాండ్రకే యింతగొప్ప పాండిత్యముఁ గలిగియున్నప్పుడు, కాళిదాసంతటి మహాకవితో వివాదమునకు బోవుట వెఱ్ఱితనమని తలంచి, వేకువజాముననే లేచి వచ్చినదారిఁ బట్టి వెడలిపోయెను.

ఢక్కాకవి స్వగ్రామముఁ జేరనే కాని, కాళిదాసును జయింపవలెనను తలంపుమాత్రము పోలేదు.— మరల సకలశాస్త్రార్థసారములన్నియుఁ జక్కఁగాఁ జదువుకొని, ఇఁకఁ గాళిదాసును గెలువఁగలనను దృఢనమ్మకము గలిగినవాఁడై తిరిగి ధారానగరంబునకుఁ బోయి యెప్పటివలెనే సత్రమున బస జేసెను.

కాళిదాసుఁ డాసంగతి నెఱింగి తొల్లింటివలెనే, నశ్వశిక్షకుని వలె వేషము ధరించి, తలపై నొకగడ్డిమోపుఁ బెట్టుకొనిపోయి ఢక్కా

కవిని దర్శించి వినమ్రుఁడై మ్రొక్కి నిలువఁబడెను. ఆసమయమున ఢక్కాకవి ప్రభాతవర్ణనము సేయుము, నస్తంగతుఁ డగుచున్న చంద్రునిగురించి యిట్లని రచించెను.

శ్లో. చరమగిరికురంగీ శృంగకండూయనేన
స్వపితి సుఖ మిదానీ మంత రిందోః కురంగః.

తా. చంద్రునిలోనున్న మగలేడిని పడమటికొండపైనున్న యాఁడు లేడి కొమ్ములతో గోరుటచేత నిప్పుడు హాయిగా నిద్రించుచున్నది.

వానిరచన వినుచున్న కాళిదాసు చిరునవ్వు నవ్వుచు దేవా! చూడగా మీరు కవిచంద్రునివలె నున్నారు. కాని, తమరు వర్ణనలోఁ గొంచెము పొరబడియున్నారు. ఏమనగా! ఆడులేడికి గొమ్ములుండవు. కావున, శృంగశబ్దము దీసివైచి తుండశబ్దము బెట్టిన బాగుండును. మిగిలిన రెండుపాదములు నేను పూరించెదఁ జిత్తగింపుఁడు.

శ్లో. పరిణతరవిగర్భవ్యాకులా పౌరుహూతీ
దిగపి ఘనకపోతీ హుంకృతైః క్రుంధతీవ.

తా. ప్రభాకరుఁడను పుత్రుఁడు గర్భమం దుండుటచే నిండు గర్భిణియైన తూర్పుదిక్కను కాంత పావురపుకూతలనుమిష చే నొప్పులు పడుచున్నదో యను నట్లున్నది.

తన చంద్రోదయవర్ణనముకంటె, వాని సూర్యోదయవర్ణనము మిక్కిలి రసపుష్టిగ నుండుటచే, ఢక్కాకవి మిక్కిలి యచ్చెరువొంది, 'నీ వెవ్వఁడ' వని ప్రశ్నించెను. స్వామీ! నేను మహాకవి కాళిదాసుగారి గుఱ్ఱపువాఁడ నని బదులుచెప్పెను. ఆ కవిశేఖరుని గుఱ్ఱపువాఁడే యిటువంటి కవిత్వముఁ జెప్పఁగలిగినప్పుడు, నింక కాళిదా సెంతటి ప్రజ్ఞావంతుఁడో నని భయభ్రాంతుఁడై ఢక్కాకవి కిక్కురు మిక్కురు మనకుండ నాయూరు విడిచి వెడలిపోయెను.

---

అల్లాణరాజవర్ణనము.

ఒకప్పుడు భోజమహీవల్లభుఁడు కొలువు దీర్చియుండ నొకబాల బ్రహ్మచారి రాజును దర్శించి, మహారాజా ! నేను ధనాదులపైఁ గాంక్షచేత మిమ్ము దర్శింప రాలేదు. నాకొక కోరిక యున్నది. నేను కాశీక్షేత్రమునకుఁ బోవఁదలఁచితిని. మీయాస్థానపండితుల నందఱను నా వెంటఁ బంపిన, పండితగోష్ఠి చేసికొనుచు ప్రయాణము సేయుటెంతయు నాహ్లాదకరముగనుండును. కావున నాకోరిక చెల్లింపుఁడని ప్రార్థించెను.

అందుల కెంతయు రాజు సంతసించి, తనయాస్థానకవుల నందఱిని వానివెంటఁ బొమ్మని యాజ్ఞాపించెను. కవిబృందమంతయు నాతని వెంటఁ బోయిరి. కాళిదాసుఁడు మాత్రము వెళ్లలేదు. నీ వెందులకు వెళ్లలేదని రాజు కాళిదాసును బ్రశ్నించెను. అంతఁ గాళిదాసుఁ డీక్రింది విధముగ విన్నవించెను.

శ్లో. తే యాంతి తీర్థేషు బుధా యే శంభో ర్దూరవర్తినః
యస్య గౌరీశ్వర శ్చిత్తే తీర్థం భోజ ! పరం హి సః.

తా. రాజేంద్రా ! ఎవరు శివునకు దూరస్థులగుదురో, వారె తీర్థయాత్రలు సేవించెదరు. ఎవనిహృదయమున మహేశ్వరుఁ డుండునో వాఁడె యుత్తమతీర్థము.

అనఁగా, తీర్థయాత్రలు నిష్ఫలములని కాళిదాసుఁడు చెప్పినందున, రాజునకు గోపము గలిగి, నాయాజ్ఞయు లక్ష్యపెట్టక నిరంతర వేశ్యాలోలుఁడై యున్నవాఁడని తలంచి, వానిని మునుపటివలె గౌరవింపక సామాన్యముగ జూచుచుండెను. రాజానుగ్రహము తనయందు దొలఁగినదని కాళిదాసుఁడు గ్రహించి వెంటనే ధారానగరంబును విడిచి, యల్లాణదేశమునకు బోయి అల్లాణరాజును సందర్శించి, రాజేంద్రా ! నేను భోజమహారాజు నాస్థానకవిని. నాపేరు కాళిదాసు. కారణాంతరమున నే నిప్పుడు మీయాస్థానము నుండవచ్చితి నని చెప్పెను. అల్లా

ణరాజు వానినెంతయు గౌరవించి, కవిచంద్రమా! నీకవితాకీర్తిని, పండితులవలన చాలసారులు వినియుంటిని. నీరాకవలన నాజన్మ ధన్యమయ్యెను. ఏదీ ఒకశ్లోకమును జదివి నా కానంద మొనఁగూర్పుమనెను. అంతఁ గాళిదాసుఁ డల్లాణరాజుప్రతాపము నిట్లు పొగడెను.

శ్లో. అల్లాణక్షోణిపాల! త్వదహితనగరే సంచరంతీ కిరాతీ
కీర్ణా న్యాదాయ రత్నా న్యురుశరఖదిరాంగారశంకాకులాంగీ
క్షిప్త్వా శ్రీఖండఖండం తదుపరి ముకుళీభూతనేత్రా ధమన్తీ
శ్వాసామోదానుయాత్తైర్మధుకరనికరై ర్ధూమశంకాం బిభర్తి.

తా. ఓయల్లాణరాజా! నీవు నిర్మూలము జేసిన శాత్రవనగరమందు చెంచుకాంత యొకతె సంచారము సేయుచు, నందందుఁ బడియున్న రత్నముల నేరి కుప్పజేసి, వాటి నగ్నికణము లనుకొని, మంట చేయుటకై, వాటిమీఁద మంచిగంధపుపేళ్లు జేర్చి, కన్నులుమూసికొని యూదుచుండెను. దానినిశ్వాసపుగంధమునకై, మచ్చోటఁ జేరినతుమ్మెదదండు పొగవలె నుండెను.

ఆశ్లోకార్థమునకు అల్లాణరాజు, కవిరాజున కపారధనరాసు లిచ్చి మిక్కిలి గౌరవించెను. కాళిదాసుఁడు తనరచనానైపుణ్యముచే, నారాజేంద్రుని సంతోషింపఁజేయుచుఁ గొంతకాల ముండఁగా, భోజరాజున కీసంగతి దెలిసి, చారులతో వర్తమాన మంపి, తిరిగి కాళిదాసుని తన రాజధానికి రప్పించుకొని యెప్పటివలె గౌరవించుచుండెను.

---

## కాళిదాసుని వాక్పటిమ.

ఒకనాఁడు కాళిదాసుని శత్రుపక్షమువారు భోజరాజుసన్నిధానమునకుఁ బోయి, రాజేంద్రా! సకలశాస్త్రపారంగతుఁడగు కాళిదాసుఁడు మత్స్యభక్షణఁజేయుచున్నాఁడని చెప్పిరి. అనంతరము రాజు కాళి

దాసును బిలిపించి, "నీవు మత్స్యభక్షణము జేయుచున్నావని చెప్పుచున్నారు. అదినిజమా" అని యడిగెను. నే నెన్నఁడు మాంసభక్షణము జేయువాఁడను గా నని కవిరాజు నిర్భయముగ రాజుతో విన్నవించెను. రాజు వానిమాటలు యథార్థమని నమ్మి, ప్రత్యక్షముగ నాకుఁ జూపనిదే యెన్నఁడిట్టి దోషారోపణ నాతోఁ జెప్పవలదని, సభాబృందమును గట్టిగా మందలించెను. రంధ్రాన్వేషణపరు లానాఁటి నూరకుండి, సమయముఁ గనిపెట్టి, కాళిదాసును బట్టుకొనుటకు బ్రయత్నించుచుండిరి.

ఒకప్పుడు కాళిదాసు బెస్తవాని యొద్దఁ గొన్ని చేపలను కొని, వాటిని గుడ్డలో జుట్టి చంకఁబెట్టుకొని, మెల్లగా వేశ్యాగృహంబునకుఁ బోవుచుండెను. కవి నెల్లప్పుడు కంటికి ఱెప్పవోలెఁ గనిపెట్టుచున్న పండితు లాసమాచారము విని వెంటనే పోయి రాజున కాసంగతిఁ దెలియఁబఱచిరి. రాజేంద్రుఁ డాయుత్తరక్షణమందే బయలుదేరి పోయి మార్గమధ్యమునఁ గాళిదాసునిఁ గలిసికొని వానిచంకనున్నమూటను గుర్తించి, యిట్లని ప్రశ్నించెను.

రాజు—హే కవే! కక్షే కిం తవ? =నీ చంకలోని దేమిటి?

కాళిదాసు—పుస్తకం=పుస్తకము

రాజు—కి ముదకం? నీ ళ్లేమిటి?

కాళిదాసు—కావ్యార్థసారోదకం కావ్యార్థసారము.

రాజు—గంధః కిం? వాసనయేమిటి?

కాళిదాసు—ఘనరామరావణి మహాసంగ్రామ రంగోద్భవం=గొప్పదగు రామరావణ యుద్ధమువలనఁ గలిగిన వాసన.

రాజు—పుచ్ఛః కిమ్? తోక యేమిటి?

కాళిదాసు—ఘనతాళపత్రలిఖితం=తాటియాకులపుస్తకము.

రాజు—కిం పుస్తకం? ఏమిపుస్తకము?

కాళి—రాజన్! భూసురదైవతైశ్చ పఠితమ్=బ్రాహ్మణులు దేవతలు పఠించునట్టి రామాయణగ్రంథము.

పూర్తిశ్లోక మీక్రింది విధముగ నున్నది.

శ్లో. కక్షే కిం తవ? పుస్తకం, కి ముదకం? కావ్యార్థసారోదకం,
గంధః కిం? ఘనరామరావణమహాసంగ్రామరంగోద్భవః,
పుచ్ఛః కిం, ఘనతాళపత్రలిఖితం, కిం పుస్తకం? హేకవే!
రాజన్! భూసురదైవతైశ్చ పఠితం రామాయణంపుస్తకం.

అప్పటికిని రాజు నమ్మక యేదీ చూపుమని యడిగెను. కవి, భువనేశ్వరిని ధ్యానించుచుఁ బైకిఁ దీయగా నది రామాయణగ్రంథ మయ్యెను. వానియం దీర్ష్యగల పండితులెల్ల రాదృశ్యమును గాంచి చకితులై సిగ్గునఁ దలవంచుకొని వెడలిపోయిరి.

---

భోజుని మరణవర్ణనము.

రాజోద్యానవనంబున నొకనాఁడు భోజకాళిదాసులు చల్లగా విహరించుచు, నం దమర్పఁబడియున్న చలువరాతిన్నెలపయిఁ గూరుచుండి లోకోత్తరసంగతులు చెప్పుకొనుచుండిరి. ప్రసంగవశమున రాజు కవిచంద్రుని జూచి యిట్లనియె. "ప్రియమిత్రమా! నన్నును నారాజ్యపాలనాదివిశేషము లెన్నియో శ్లోకరూపముగఁ జెప్పి నాకు శాశ్వతానంద మొనగూర్చితివి. కాని, చిరకాలమునుండి నా కొక కోరిక గలదు. నీవు మారుబలుకక నాకోరిక దీర్పవలయు. ఏమనిన? నామరణానంతరము ధారానగర మెట్లుండునో, నీనోట వినవలయునని యున్నది. ఆకోరఁ తఁ దీర్చి నన్ను ధన్యునిఁ జేయు" మనెను. కాళిదాసుఁడు, రాజుమాటల కదరిపడి కోపతాపములు గలవాఁడై, "మహారాజా! ఇదియేటి కోరిక? నిరంతరము నీయుప్పు బులుసుఁ దిని, నీవలన నింతవాఁడనై, నీశ్రేయస్సు గోరువాఁడనై యున్న నేను, నీవు సజీవముతో

నుండఁగా, నీమరణవర్ణనము వర్ణించుటకు నా నోరెట్లాడును ? కుడిచి కూర్చుండ నేరక నిట్టికోరిక గోరదగునా? ఇంతకంటె మహాపాప మెందైనఁ గలదా ?. కావున నే నాపని జేయజాల"నని ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాటలకు రాజన్యుఁ డాగ్రహోదగ్రుఁడై కాళిదాసు నావలకుఁ బొమ్మనెను. వెంటనే కవిచంద్రుఁ డటనుండి లేచిపోయి విలాసవతి యగు వేశ్యతోఁ గూడ నాదేశము విడిచి యేకశిలానగరంబునకుఁ బోయి నివసించుచుండెను.

అనంతరము రాజేంద్రుఁడు, తనకోరిక నెఱవేఱకపోవుటయే గాక, కాళిదాసుఁ గూడ దేశము విడిచి యెక్కడకుఁ బోయినదియుఁ దెలియక మిక్కిలి విచారగ్రస్తుఁ డయ్యెను. కొన్నాళ్లకు చారులవలనఁ గాళిదాసుఁ డేకశిలానగరమం దున్నట్లు విని, యొకనాఁటిరేయి తా నొంటరిగ గవిశేఖరునిగృహంబునకు మాఱువేసమునఁ బోయి, శాస్త్రోక్తముగ శంఖనాదముఁ జేసెను. శంఖముఁ బూరించినవాఁ డెవ్వఁడా యని కవిశేఖరుఁడు వీధిగుమ్మములోనికి వచ్చి, ఓయీ ! నీవెవ్వఁడవని యడిగెను. రాజు తనకంఠము మార్చి, దేవా ! నేను కాపాలికుఁడను. ధారానగరవాసి నని చెప్పెను. "సాహసవిక్రమార్కుండును, నర్థిజనకల్పభోజుండునగు భోజమహారాజు ధారానగరమును, బాలించుచుండ, నీకు ఘోషాటనము సేయుగతి యెట్లు గలిగె"నని కవిరాజు ప్రశ్నించెను.

స్వామీ ! నే నేమని విన్నవింతును ? కొలఁదిదినములక్రిందటనే భోజమహారాజు స్వర్గస్థుఁ డయ్యెనని కాపాలికుఁడు భోరున నేడ్చెను. ఆమాటలు చెవినిఁబడగనే కాళిదాసుఁడు మూర్ఛిల్లి, కొంతవడికి లేచి, 'హా ! భోజమహారాజా ! పండితజనకల్పభూజ ! సాహసవిక్రమార్కా ! కలియుగదేవేంద్ర ! ఎంతలో దివికేగితివి ? నీకు మరణకాల మాసన్నమగుటచేతనే కాఁబోలు, నానాఁడు నన్ను నీమరణవర్ణన జేయుమని కోరితివి.' అని, కొంతవడి విచారించి యీక్రిందిశ్లోకమును జదివెను.

శ్లో. అద్య ధారా నిరాధారా, నిరాలంబా సరస్వతీ.
పండితాః ఖండితా స్సర్వే భోజరాజే దివంగతే.

తా. భోజరాజు స్వర్గీయుఁడగుటచేత నేఁడు ధారానగరము నిరాధారము. సరస్వతి యాలంబము లేనిదయ్యెను. పండితులకోరికలు భగ్నము లైనవి.

ఆశ్లోకము కాళిదాసునోటినుండి వెడలఁగనే, కాపాలికుఁడు నిలువున నేలఁగూలెను. కాళిదాసుఁ డతఁడట్లు నేలఁగూలుట కాశ్చర్యపడి వానియొద్దకుఁ బోయి పరీక్షించగా నతఁడు భోజరాజయ్యెను. "హర హరా! ఎంతపాప మెంతపాపము? మరణవార్త నానోట వెలువడుట చేత రాజు మృతుఁ డయ్యెను. కవివాక్కు తప్పదనుట నిజమైనది. అయ్యో! నాసంరక్షకుని నేనే చంపుకొంటినిగదా! నాయీపాపపరిహార మెట్లు?" అని పెల్లుగ దుఃఖించి, జగదీశ్వరుని తనమనంబున దలంచి, పైశ్లోకము నిట్లు మార్చి మరలఁ జదివెను.

శ్లో. అద్య ధారా సదాధారా, సదాలంబా సరస్వతీ
పండితాః మండితాః సర్వే, భోజరాజె భువంగతే.

తా. భోజమహారాజు ధరాపాలనము జేయుటచే, ధారానగరము మంచియాధారము గలిగియున్నది. సరస్వతి మంచి యాలంబము గలది. పండితులందఱు గౌరవింపఁబడుచున్నారు.

అని శ్లోకముఁ జదువగనే కాపాలికుని వేషముతో నేలఁగూలియున్న మహారాజు లేచి నిలిచి, కాళిదాసువను నమస్కరించెను భోజకాళిదాసు లిరువురు గాఢాలింగనముఁ జేసికొనిరి. రాజేంద్రా! ఎంతపని జేసితివి? దైవవశమున బ్రతికి, నాకు శాశ్వతకీర్తి గలిగించితి వని కవి యనెను. వెంటనే రాజేంద్రుఁడు కాళిదాసును వెంటఁబెట్టుకొని ధారానగరంబునకు బోయెను.

## పతివ్రతాప్రభావము.

భోజకాళిదాసుల మైత్రి భంగము జేయ విద్వద్బృంద మిదివఱ కెన్నిసారులో ప్రయత్నించి విఫలమనోరథులైరి. కాని, యసూయాగ్రస్తులగు పండితులు మఱియొకసారి దీర్ఘముగ నాలోచించి, రాజాంతఃపురదాసియగు చతురికను రావించి, ముత్యాలహార మొకటి దాని గళసీమ నలంకరించి, చతురికా! తొల్లింటి మా గౌరవాతిశయములు నిలబెట్టి, కాళిదాసుని దేశభ్రష్టు గావించుట కేదేని యుపాయముఁ జెప్పి, రాజున కతనిపై ద్వేషాగ్ని రగుల్కొల్పవలయు నని దాని నెంతయో బ్రతిమాలాడిరి. పేదను పెన్నిధి దొఱకినచందమున, నమూల్యమగు ముత్యాలహారము దొఱకుటచే నుబ్బి తబ్బిబ్బై, ఈ పాటికి కవిని గహనాంతములకుఁ బాఱద్రోలించెదఁ జూడుడు! నా ప్రజ్ఞ యని వారితోఁ జెప్పి రాజమందిరమునకుఁ బోయెను.

మఱునాఁడు భోజమహారాజు హంసతూలికాతల్పంబున శయనించి యుండఁ, జతురిక పాదము లొత్తుచుఁ దనకు నిద్రవచ్చినట్లు నటించి, రాజేంద్రుని మందిరమునకు గొలదిదూరమున బరుండి, కపట నిద్రతో నిట్లని వదరఁదొడఁగెను. "ఓసీ! మంజువాణీ! రాజద్రోహమని యెంచఁ దలపకఁ గాళిదాసుఁడు దాసీవేషముతో రాణీమందిరమునఁ బ్రవేశించి లీలావతీదేవితో రమించుచున్నాఁడు. రాజు వచ్చుచున్నాఁడేమో చూచుచుండవే." రాజేంద్రుఁ డప్పటికింకను కలకనిద్ర నుండుటచే, దాసీమాటలు కర్ణశూలములవలెఁ జెవినాటగా నదరిపడి లేచి, "చతురికా! చతురికా!" అని గంభీరముగ బిలిచెను. దాసి గాఢనిద్రయందున్నట్లు నటించి ప్రత్యుత్తర మీయలేదు. అంత భోజుఁడు తన మనంబున నిట్లని వితర్కించుకొనఁ దొడఁగెను. ఈచతురిక లీలావతీ కాళిదాసుల మైత్రి నెఱిఁగినదగుటచే నిట్లు పలవరించుచున్నది. స్త్రీ సాహస మెవ్వఁ డెఱుఁగఁగలఁడు. కాళిదాసుఁడు స్త్రీవేషమున నంతఃపురమునకు

వచ్చుచుండుట సత్యము. దాసిమాటలయం దబద్ధము లేదు. ఆహా! స్త్రీలు జగజంతలుగదా! అని కొంతవడి చింతించి మరునాఁడు కొలువు కూటంబున కేగక, తనకు జ్వరము వచ్చినదని పండుకొని, కాళిదాసును బిలిపించెను. కవి వచ్చి కూర్చుండియుండఁగ, రాజు లీలావతీదేవినిఁ గూడ బిలిపించి, "లీలా! నాకు పథ్యముఁ గొనిరమ్మ"నెను. రాణి లోనికేగి రజతపాత్రలో నన్నము పెసరపప్పు బెట్టుకొని వచ్చి భర్తముందటఁ బెట్టెను. రాజేంద్రుఁడు వారిరువురి యభిప్రాయముఁ దెలిసికొనవలెనని, యొకశ్లోకములో రెండుపాదములు రచించి,

శ్లో. ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర! వితుషా కథం,

తా. ఓకవిరాజా! రోగమునకు పామువంటిదగు పెసరపప్పు పొట్టు లేకున్న దేమి? అని చదివెను.

కాళిదాసుఁ డాశ్లోకమునకు నుత్తరార్ధ మిటులఁ బూరించెను.

అంధోవల్లభసంయోగా జాతా విగతకంచుకా.

తా—అన్నమను పెనిమిటితోఁ గలియుచున్నది గనుక, పెసరపప్పు రవికను దీసివైచెను.

లీలావతీదేవియుఁ గవయిత్రి కావున, వానిశ్లోకార్థము గ్రహించినదై, చిరునవ్వు మొగంబున వెలయ దల వాల్చుకొని యుండెను.

రాజప్పు డది కనిపెట్టి, "యీయామె నిజముగ కాళిదాసుతో మైత్రి గలిగియె యున్నది. మిత్రత్వ ముండుటచేతనే, రాణి సాన్నిధ్య మం దున్నదనియైన సంకోచింపక, నితఁడు మోటుదనముగ శ్లోకార్థము బూరించినాఁడు. ఈమెయు వానిరచన వినియు లజ్జ లేక మందహాసముఁ జేసినది.

శ్లో. అశ్వప్లుతం, వాసవగర్జితం చ, స్త్రీణాం చ చిత్తం, పురుషస్య భాగ్యం
అవర్షణం చా,ప్యతివర్షణం చ, దేవో న జానాతి, కుతో మనుష్యః.

తా—గుఱ్ఱపుఁదకయు, మేఘగర్జనంబును, స్త్రీలచిత్తమును, పురుషునిభాగ్యమును, అతివృష్టియు, ననావృష్టియు దేవతలకైనను దెలిసికొనుట దుర్లభము. ఇంక మనుష్యమాత్రుల కేమి తెలియును?

ఈతఁడపరాధియైనను బ్రాహ్మణుఁడగుటఁ జంపఁగూడదు. అని రాజమనస్సుఁ డాలోచించి, కాళిదాసును జీరి, 'ఓకవీ! నీవు నారాజ్యంబున నుండవలదు. మారుమాటాడక వెంటనే వెడలిపొమ్ము' అని కఠినముగ శాసించెను. ఉత్తరక్షణమందే కాళిదాసుఁడు రాజుసన్నిధానమునుండి తొలఁగి, తనవేశ్యాగృహంబునకుఁ బోయి, దానితో నిట్లు చెప్పెను. "ఓప్రియామణీ! నేఁడు భోజరాజునకు నామీఁద మహాగ్రహము గలిగి నన్ను తనరాజ్యమునుండి వెడలిపొమ్మనెను. ఇదంతయు నాయందసూయాపరులగు విద్వత్కవులు జేయించిన ప్రయోగముగాని వేఱొండుగాదు. వారివలన నా కెన్నటికైనఁ బ్రాణాపాయమే గాని సుఖము లేదు రాజులు తరాజులవంటివారు. వారిచిత్తవృత్తి సరిగా నుండదు. ఇంక గతించినదానికిఁ జింతించుట వెఱ్ఱితనము. నా కనుజ్ఞ యిమ్ము. పోయి వచ్చెద." నని పలుకగా విలాసవతి వానితో నిట్లని విన్నవించెను.

"ఓకవినాథా! మనోనాథా! ఏల యిట్లధైర్యపడెదరు? రాజసంబంధముఁ బోయినంతమాత్రమున మీ కొట్టికొఱంతయు లేదు. వానిధనముతో మనకవసరములేదు. నేను జీవించియుండగా మీమీఁద నీఁగనైన వ్రాలనీయక గాపాడుచుండెదను. మీరెక్కడకును బోవలదు. ఇచటనే యుండి హాయిగా సుఖింపుఁడు. మిమ్ము విడిచి నేను బ్రతుకలేను." అని దీనాననయై వేడుకొనెను. కాళిదాసుఁ డావేశ్యాదరణకు సంతసించి యచ్చోటనే కాలముఁ గడుపుచుండెను.

అటులఁ గాళిదాసుఁడు వెడలిపోయినతరువాత, లీలావతీదేవి వినమ్రయై, మనోహరా! జగద్విఖ్యాతమైనభోజకాళిదాసులమైత్రి నేఁడిట్టికారణముగ భగ్నమైనదేమి? రాజ్యమునుండి వెడలఁగొట్టఁబడినంతనే

దారుణాపరాధ మతఁ డేమిచేసెను ? హితోత్తముఁడును, బుద్ధియందు బృహస్పతివంటివాఁడును, విద్వత్కవిజనాగ్రగణ్యుఁడును, జగత్ప్రసిద్ధచరితుఁడును, సరస్వతీదేవి యవతారమూర్తియగు వానిపై నింతటి కోప కారణమేల ?

శ్లో. శోకారాతి పరిత్రాణం, ప్రీతి విస్రంభభాజనం
కేన రత్న మిదం సృష్టం మిత్ర మిత్యక్షరద్వయం.

తా— దుఃఖమునెడిపగవారినుండి కాపాడునదియు, విశ్వాసమునకుఁ దానకమై గొప్పదైనదియు 'మిత్ర' యనుపదమునందలి రెండక్షరముల నెవఁడు సృష్టించెనోగదా !

రాజన్యుఁ డామె పలుకు లన్నియు నాలించి, తనమనస్సునఁ గలయ మెల్ల నామెతో విప్పిచెప్పెను. రాజుమాటలకు దేవి భయాశ్చర్యజనితయై, మనోహరా! దేహములు రెండైనను ప్రాణ మొక్కటిగ మెలఁగిన మనయన్యోన్యమున కెంతటియంతరాయము వాటిల్లెను ? నిష్కళంకమగు మీహృదయకమలమును జీకాకుపఱచి, నాజీవితజ్యోతికిట్టి కళంక మాపాదింపఁదలఁచిన పాపాత్ము లెవ్వరు ? జగన్మోహనాకారులగు మిమ్ముఁ భర్తగాఁ బడయుట చేతనే నాజన్మ సార్థకమైనది. కాని, యిట్టిదారుణాపవాదము భరించి నే నింక, మనుట కల్ల కావున, నాదేహత్యాగమునకు ముందు నాపతివ్రతాధర్మముమాత్రముఁ బరీక్షింపవలయును ? అనవుడు రాజు సరేనని, త్రాసుపామును, యెఱ్ఱగాఁగాలినయినుపగుండును, బాణముసంధించియున్నవిల్లును దెప్పించి, దేవికిఁ జూపించెను. వెంటనే లీలావతీదేవి సుస్నాతయై వచ్చి, సూర్యభగవానున కంజలి ఘటించి, ఓజగచ్చక్షూ! ప్రభాకరా ! త్రిమూర్త్యాత్మకా! నీవు సర్వసాక్షివి. సర్వకాలసర్వావస్థలయందును, భోజమహారాజు చరణారవిందములే గతియనినమ్మి యున్నదాననేని నామానప్రాణములఁగాపా

డును. నే నన్యథా వర్తించితినేని, కళంకినిగా దహించివేయుము. అని నమస్కరించి, త్రాచుపామును ముద్దుపెట్టుకొని, అగ్నిగోళమువంటి యినుపగుండును చేతఁబట్టుకొని, బాణముతో దన్నుఁగొట్టుకొనెను. ఆమె కొందును గీఁటు గలుగలేదు. మహాతేజస్వరూపిణియై, యపరదేవతవలె వెలుఁగొందుచున్న, భార్యపాతివ్రత్యధర్మంబున కెంతయు రాజు చకితుఁడై, తన యవివేకమున కెంతయు సిగ్గుపడి పశ్చాత్తాపంబున భార్యను క్షమార్పణఁ గోరెను. కాని, నిరపరాధిని, నిష్కళంకుని, నిరాడంబరుని, నీతిమార్గదర్శకుని, నిస్సీమవిద్యాప్రభావోజ్వలుని కాళిదాసుని, నిష్కారణాపవాదభరంబున దేశముచుండి వెడలనడపిన తన యవివేకమునకు మిక్కిలి వగచి నాఁటినుండియు నిద్రాహారములును, రాచకార్యములు, గూడ మాని విచారగ్రస్థుఁడై యుండెను.

---

## భోజకాళిదాసుల పునఃసమాగమము.

కాళిదాసుఁడు పదభ్రష్టుఁడైననాఁటనుండి భోజరాజు సభామందిరము చంద్రుఁడులేని రాత్రివలెను, కీరములేనిపంజరమువలెను, సీతారాముల వియోగమువలెను తేజోవిహీనమై మౌనముద్ర వహించియుండెను. ఆనాఁటి చమత్కారసమస్యలంతరించినవి. శృంగారహాస్యరస శ్లోకపూరణములు మారణములైనవి. వినోదవాదప్రతివాదములు నిర్వాదములైనవి. ఏదో సమయానుకూలముగ రాజేంద్రుఁడు సభకువచ్చి పోవుటయే గాని, కాళిదాసుని వియోగములోనే కాలము జరిగిపోవుచుండెను.

ఒకప్పుడు రాజు పూర్ణచంద్రమండలమునుఁ జూచి, చెంతనున్న దేవీముఖ చంద్రమండలమును గూడ జూచి యిట్లని వర్ణించెను.

"తులిణం అణు సఇగ్ఘా ముఖచందస్సపోక్షు విదాహ"

అని రచించి, మరునాఁడు కొలువుకూటమున కేగి యాసమస్యను బూరించుడని పండితుల కాజ్ఞయిచ్చెను. పండితు లాశ్లోకార్థమును గ్రహింపలేక నొకఁడొకని మొకరు జూచుకొనుచు మాటలాడక యూర కుండిరి. రాజన్యుఁడు వారియసమర్థతకు కోపోద్దీపితహృదయుఁడై, పండితులారా! మీ రీశ్లోకముఁ బూరించుటకుగాను వారముదినములు గడు విచ్చితిని. అట్లు పూరింపలేని నారాజ్యము విడిచి వెళ్లిపోవలయునని గట్టిగా నాజ్ఞయిచ్చెను.

ఇందులకుఁ గర్తవ్య మెట్టులాయని పండితులంద ఱొకచోటసమా వేశమైరి. నాఁటితో గడువుదినముగూడ సరిపోయినది. అంత శంకరుఁడు లేచి తక్కినకవులం జూచి, మిత్రులారా! ఇది మనస్వయంకృతాపరాధ మే గాని వేఱు గాదు. హాయిగా కుడిచి కూర్చుండనేరక, దేవీవరప్రసా దకలితాలబ్ధుఁడగు కాళిదాసుమహాకవియందు మత్సరము గలవారమై, మహాపరాధము వానిపై మోపి దేశభ్రష్టుని గావించితిమి. మన మొనర్చిన పాపమునకుఁ బ్రతిఫలముగ నట్టిగతియే మనకుఁ బట్టినది. ఆతఁడే యున్నచో నిట్టిస్వల్పవిషయమున మనకీగతియుఁ బట్టియుండదు గదా! ఇంక నెంతఁ జింతించినఁ బ్రయోజనము లేదు. ఆసమస్యాపూరణము మనవల్లఁ గాదు. మఱునాఁడు రాజభటులువచ్చి మనల వెడలఁగొట్టకమునుపే మన మీరేయి జల్లగా దాటిపోవుటెంతయు నుత్తమమని చెప్పగా, నంద ఱునట్లె యనిరి. అంత సూర్యాస్తమానానంతరముఁ దమతమసామగ్రుల నెల్ల బండ్లమీద వైచుకొని యాలుబిడ్డలతోఁ గూడ నడిరేయిని పలాయనము సాగించిరి.

వారిబండ్లన్నియు విలాసవతిమందిరము వెనుకనున్న తోటనుండియే పోవుచుండెను. ఎద్దుల నదలించు కేకలును, గంటలగణగణధ్వనియుఁ గాళిదాసునకు నిద్రాభంగముఁగావించెను. కాళిదాసుఁడు వెంటనే యొక పరిచారికను బంపి, "యాపోవుచున్నవా రెవ్వరో కనుగొని రమ్మని

పంపించి, పోవుచున్నవారు రాజాస్థానకవులైయుండునని విలాసవతితో జెప్పి, దాసికొఱ కెదురుజూచుచుండెను. అంతలో దాసి వచ్చి 'దేవా! వారందఱు మనరాజుగారి పండితులే. ఎందులకో పలాయనమగుచున్నా' రనిచెప్పెను. కాళిదాసుఁ డామాటలు విని వెంటనే వేషముమార్చుకొని, మఱియొకత్రోవగుండ వారికంటెముందుగాఁ బోయి, వారిం గలిసికొని, "ఓకవిచంద్రులారా! మీ రీయర్ధరాత్రంబున నెచ్చటకు బోవుచున్నారు? నే నొకసామాన్యకవిని. కాశీనుండి వచ్చుచుంటిని. మీమూలమున భోజమహారాజును దర్శించి, ధన మార్జింపవలయునని కొండంత యాశతో బయలుదేరి వచ్చితి"నని విన్నవించెను. వానిమాటలకుఁ బ్రత్యుత్తరముజెప్ప నందొకఁడు వానితో, తనపలాయనకథయంతయు జెప్పి సమస్య జదవి వినిపించెను. కాళిదాసుఁడు దానియుత్తరార్థ మీ క్రిందివిధముగఁ జదివెను.

శ్లో. అణు ఇది బాణయిది, కహూం అణుకిది తస్సప్పకడి చందస్స?"

ఆసమస్యాపూరణము మిక్కిలిరసవంతముగ నుండుటచే దమముప్పు తప్పినదని వారందఱు సంతసించి, కాళిదాసునకు నమస్కరించి తిరిగి తమబండ్లను వెనుకకు మరలించుకొని పోయి గృహంబులఁ జేరుకొనిరి. మరునాఁడు వారందఱు రాజును దర్శించి, సమస్యాపూరణఁ జదివి వినిపించిరి. రా జది వినఁగానే, యీశ్లోకపూరణము కాళిదాసుదే నని గ్రహించుకొన్నవాఁడై, కవులకు దగినసత్కారములు గావించి పంపించెను. అనంతరము కవులలో నొకరిని బిలిపించి యీసమస్యాపూరణ యథార్థముఁ జెప్పవలె నని రా జడిగెను. అతండు జరిగిన సంగతంతయు నిజముగ చెప్పివైచెను.

రాజన్యుఁడు వానిమాటల ధోరణినిబట్టి, కాళిదాసుఁడు విలాసవతిమందిరమందే రహస్యముగ దాఁగియున్నాఁడని తెలిసికొని, వెంటనే తాను సపరివారముగ వేశ్యాగృహంబునకుఁ బోయెను. ఆకస్మికముగ

కాళిదాసుఁ డెదురుపడెను. వెంటనే భోజకాళిదాసులిద్దఱు గాఢాలింగనముఁ జేసికొని, యానందబాష్పములు రాల్చిరి. రాజు కాళిదాసుని కన్నీటిధారలు తనయుత్తరీయముచేఁ దుడిచి, తనయపరాధశతంబులు క్షమింపుమని వేడుకొని తనయశ్వంబుమీఁదఁ గాళిదాసునుగూడ నెక్కించుకొని రాజమందిరమునకుఁ గొనిపోయి మహదానంద మొందెను.

---

## జారత్వ కళాశాస్త్ర పరీక్షాఫలితము.

భవభూతి కవిచంద్రుఁడే గాక, పూర్ణక్షపాకరబింబసదృశుఁడు. ఒకప్పు డతఁడు దబ్బపండువంటి శరీరచ్ఛాయయుఁ గండపుష్టియు గలిగి చూపరులహృదయములు కొల్లగొట్టుసుందరాకారముతో, రాజమందిర సమీపమునుండి పోవుచుండెను. రాజునకు దగ్గఱచుట్టమైన యొకసుందరాంగి, పోవుచున్న భవభూతిని జూచి, మోహపరవశయై, తనమనోరథము నీడేర్పుమని తనదాసిని వానియొద్దకు రాయబార మంపెను. దూతికమాటలు భవభూతి వినుటయు, నాయుత్తరక్షణమం దాలావణ్యవతి, మేడపైభాగమునుండి తన వాలుఁజూపులు బ్రసరింపుచు, మెఱపుఁదీఁగవలె మెఱయుటయుఁ గనుంగొని, కామశరపీడితుఁడై, యాలతాంగి నెయ్యమున కియ్యకొనెను.

కాని, దుర్భేద్యములగుకోటగోడలు గలిగి, రాజాంతఃపురము నిరంతరము విచ్చుగత్తుల పహరాలతో పోతుటీఁగయైనఁ జొర వీలులేకుండ నుండుటచే నాజగన్మోహిని, తనమందిరమునుండి భవభూతిమందిరమువఱకు భూమినుండి సొరంగ మొకటి ద్రవ్వించెను. అనంతరము భవభూతి ప్రతిదిన మర్ధరాత్రమున నాసొరంగముగుండ నంతఃపురముఁ బ్రవేశించి, యాకాంతామణితో స్వేచ్ఛగా సుఖముల ననుభవించుచుండెను. కొంతకాలమున కాపడఁతి గర్భవతి యయ్యెను. చెలికత్తెలు భయపడి తమ ప్రాణములమీఁది కేమివచ్చునో యని, భోజరాజున కాయుదంతముఁ

దెలియఁబఱచిరి. రాజన్యుఁ డామాటలు విని కోపగ్రస్తుఁడయ్యుఁ దద్రహస్యము తన యాంతరంగికమిత్రులగువారికిఁ దెలియఁబఱచి, యంతఃపురద్రోహి నెట్టులయినఁ బట్టుకొనవలె నని యోచించిరి.

ఒకఁ డామందిరము రహస్యముగఁ బ్రవేశించి పరీక్షించఁగా, మందిరములోనికి సొరంగమున్నట్టుఁ గనిపెట్టి, రాజుతో విన్నవించి, దానిలో నొకకత్తెరబోను నమర్చెను. ఇదంతయు నాసుందరాంగి కిసుమంతయుఁ దెలియదు. భవభూతియు యథాప్రకారముగ సొరంగముగుండఁ బోయి, యాచీఁకటిలోనున్న దాని గుర్తింపలేకఁ గత్తెరబోనులో జిక్కువడి, యురచుట్టుకైన వీలు లేకుండఁ గుత్తుకఁ గత్తిరింపఁబడుచుఁ గ్రొన్నెత్తురులు గారుచుండఁగ, నానెత్తుటితో గోడమీఁద నీక్రిందివిధముగ శ్లోకమొకండువ్రాసి, ప్రాణములు విడిచెను.

శ్లో. కేవా నసంతి భువి వారిరుహావతంసా
హంసావళీవలయినో జలసన్నివేశాః.

తా. ఈభూలోకములోఁ దామరపువ్వులు శిరోభూషణములుగా నలరారునట్టియు, హంసలగుంపులు కంకణములుగా గలిగినట్టియు సరస్సు లెన్ని లేవు ?

తనప్రియుండు రాకపోవుటచే నాకోమలాంగి యెదురుచూచుచుఁ బ్రాణంబులు విసిగి, సంశయాకులచిత్తయై సొరంగముచెంతకుఁ బోయి చచ్చిపడియున్న ప్రాణప్రియునిఁ జూచి పెల్లుగ దుఃఖించెను. దాసివలన జరిగినవృత్తాంతము రాజు విని, తనమిత్రులతో నచ్చోటుకు బోయి, చచ్చిపడియున్న భవభూతిని జూచి యెంతయు వగచి, వెనుక నేను జారత్వకళయందుపరీక్ష యివ్వవలసినదిగా నీతనిం గోరుటచే, నావల్లనే యిట్టియకాలమరణము సంప్రాప్తించిన దని విచారపడుచు గోడమీఁద వ్రాయఁబడియున్న భవభూతిశ్లోకార్థమును జదివి, మహారాజు పండితు

లను రావించి యది సమస్యగా నిచ్చి పూరింపుఁ డనెను. ఎవ్వరుగూడ దానిని పూరింపలేకపోవుటచే, గాళిదాసుఁ డీక్రిందివిధముగఁ బూరించెను.

శ్లో॥ కిం చాతకః ఫల మపేక్ష్య సవజ్రపాతాం .

పౌరందరీం కలయతే నవవారిధారాం॥

తా. చాతకపక్షి యేమిఫలితమున కాసించి, పిడుగులతోఁగూడు కొన్నట్టి వర్షధారను గోరుచున్నది; అనగా లోకంబున సుందరాంగు లెందఱొందఱో యుండగా నట్టివారితో సుఖింపలేక, మానవుఁ డపాయ కరస్థలములకుఁ బోయి, యుపున్నకాంతల నేల గవగూడవలయు"నని భావార్థము.

ఆసమస్యాపూరణమునకు రాజు కాళిదాసును మెచ్చుకొనెను. కాళిదాసుయుం దీర్ష్యాగ్రస్తులగుపండితులుమాత్ర మది భవభూతియభి ప్రాయము గాదని వాదించిరి. కాళిదాసుఁడు వారిమాటల కెంతయు గినిసినవాఁడై, భవభూతిశవంబును తెప్పించి, మొండెమునకు శిరము నంటించి, హేజగన్మాతా! భువనేశ్వరీ! భక్తాభీష్టప్రదాయిని! నా మొఱాలించి భవభూతిని బ్రతికింపు మని ప్రార్థించెను. భువనేశ్వరియను గ్రహవిశేషంబున నిద్రనుండి లేచినట్లుగ భవభూతి లేచెను. అంతఁ గాళిదాసు భవభూతిం జూచి, మీరు గోడపై వ్రాసిన శ్లోకమున కుత్త రార్థ మేమని యడిగెను. అతండు గాళిదాసుపూరించినదే చదివెను. కాదని వాదించిన పండితులనోళ్లు మూతలు పడినవి. కాళిదాసునా జ్ఞను భవభూతి కాకాంత నిచ్చి రాజేంద్రుఁడు పెండ్లిజేసెను.

---

## రోఁకలి సమస్య.

ఒకనాఁడు రాత్రి భోజరాజు ప్రచ్ఛన్నవేషముతోఁ బురవీథులు సంచరించుచుండ, నవయౌవనసుందరాంగి యొకతె లేతచిగురులవంటి తనమృదులహస్తములతో రోఁకలి బట్టుకొని ధాన్యము దంచుచుండెను.

ఆమెకుసుమపేశలశరీరమును, శరీరమునుండి వెలయుచిసిమిచాయలును; చాయలకనుగుణ్యముగ వర్తించుముఖచంద్రమండలకాంతియును రాజు వీక్షించి, తనమకింబున రోకలినుద్దేశించి, "ఓరోకలీ! చిగుటాకులవంటి యీ మెకరస్పర్శభాగ్యముచేతనైన నీవు చిగర్చలేవుకదా! నీవు వట్టిజడుఁవే" అని యర్థమిచ్చుతెలుంగున నీక్రిందిశ్లోకార్ధమును జదువుకొనెను.

"ముసల! కిసలయంతే తత్క్షణాద్యన్నజాతమ్ ?

అనంతరము భోజరాజు తనమందిరమునకుఁ బోయి మరునాఁడుదయమున, నాసమస్య నిచ్చి పూరించుమని కాళిదాసునితోఁ జెప్పెను. అతఁడిట్లు పూరించెను.

శ్లో॥ జగతి విదిత మేతత్ కాష్ఠమేవాసి నూనం,
తదపి చ కిల సత్యం కాననే వర్ధితోఽసి
నవకువలయనేత్రాపాణిసంగోత్సవేఽస్మిన్
ముసల! కిసలయంతే తత్క్షణా ద్యన్నజాతం.

తా. ఓరోకలీ! క్రొత్తకలువలఁబోలు నేత్రములుగల, యీ వెలజవ్వని హస్తసంపర్కముచేతఁగూడ నీవుచిగురింపనిహేతువుచే నీ వరణ్యమున వృద్ధిఁజెందుచున్నప్పటికి నీవు వట్టికొయ్యవేసుమా!

రాజున్నుఁ డాశ్లోకపూరణసారస్యంబున కెంతయు నానందించి కవిచంద్రుని నెంతయో గౌరవించెను.

---

పుట్టుమచ్చ.

చిత్రలేఖనమం దనేకరాజాస్థానములఁ బేరు వడసిన గొప్పచిత్రకారుఁ డొకఁడు భోజమహారాజు దర్శించి, "ఓప్రభుపరేణ్యా! చిత్రలేఖనమందు నాకసమానప్రజ్ఞావిశేషములు కలవు. నాకైనేను బాగుగ కొనుటకొరకయొక్తి యైనను తమవంటిప్రభువులసన్నిధానమున వివరించు

కొనుట మాకు విధియైయుండి. నే నందఱివలె మనుష్యులను జూచి వ్రాయువాఁడను గాను. వారిరూపాకృతులు జూడక, వారితలవెండ్రుకనుమాత్రము జూచి; దానిం బట్టి, స్వరూపము లచ్చముగ వ్రాయఁగలవాఁడను. తమరు నాలేఖనముఁ జిత్తగించి పరీక్షింపవలయునని ప్రార్థించుచున్నాను." అనవుడు రాజు వానిప్రజ్ఞావిశేషములు పరీక్షింపఁ దలఁచి, పరిచారిక నంతఃపురమునకుఁ బంపించి లీలావతీదేవితలవెండ్రుక నొకటిఁ దెప్పించి వానికిచ్చి దీనినిఁబట్టి పట్టమహిషియగు లీలావతీదేవిచిత్రఫలకమును వ్రాసి గొనితెమ్మని వానికాజ్ఞ యొసంగెను.

చిత్రకారుఁడు రాజాజ్ఞం బడసి, తనవిడిదిగృహము నకుఁ బోయి స్వల్పకాలములోనే చిత్తరువువ్రాయుట బూర్తిజేసి, యాబొమ్మనుదుట గస్తూరితోఁ బొట్టుపెట్టెను. వెంటనే యాతిలకము నుదుట నిలువక తొడపైఁ బడెను. మరల మొగమున జక్కఁగ దిలకమును బెట్టెను. అదియు గూడ తొడపైఁ బడిపోయెను. అట్లెన్నిసారులు ప్రయత్నించినను వెనుకటియట్లే జరిగెను. అకాండంబుల కెంతయు జింతిల్లుచు నేమియు దోఁచక స్థితిలో నటునిటుఁ బచారుసేయుచుండఁగాఁ గాళిదాసుఁ డేతెర వ్యెను. చిత్రకారుఁడు కాళిదాసునకు నమస్కరించి, తిలకము విషయమై చెప్పి ప్రత్యుత్తరమునకు వేచియుండెను. అంతఁ గాళిదాసు వానితో నిట్లనియె. "ఓయీ! లోకంబునఁ బద్మినీజాతియువతులకు తొడయందుఁ దప్పకఁ బుట్టుమచ్చ యుండును. లీలావతీదేవి పద్మినీజాతిస్త్రీ. కావున, తొడయందు పుట్టుమచ్చ యున్నది. నీవు వ్రాయుటలోఁ బుట్టుమచ్చ వేయలేదు గావున, మొగమునందుఁ బెట్టినతిలకము జారి, యాపుట్టుమచ్చ యున్నచోటనే పడుచున్నది. కావున, నీవు మరల దిలకమును పెట్టుము. పెట్టిన దెప్పటియట్లనే జారి తొడమీద పడిపోవును. తొడపైఁ బడినదాని నట్లే యుంచి, మరల దిలకమును బెట్టుము. పడిపోవక నిలిచి యుండు"నని చెప్పి వెడలిపోయెను.

అంత నతండు గాళిదాసుఁడు చెప్పినప్రకారము సేయగ మొగమున గస్తూరీతిలకము చక్కఁగా నిలఁబడెను. అప్పుడతఁ డెంతయు సంతసించి, కాళిదాసుని దేవునిగఁ దలంచి, మరునాఁ డాచిత్రపువు గొనిపోయి, సభావేదికపయి గూరుచున్న మహారాజునకు సమర్పించి నమస్కరించెను.

రాజన్యుఁ డాచిత్రఫలకమును జూచి, నిర్విణ్ణుఁడై అహా ! ఎంత చక్కఁగా వ్రాసినాఁడు ? చిరునవ్వు మొగమును, పద్మములవంటి నేత్రములును, గలిగి నిర్జీవమయ్యు, సజీవముగ నున్నట్లు గాన్పించు, దేవి రూపురేఖాదు లచ్చుగ్రుద్దినట్లు చిత్రించిన, వానినేర్పున కెంతయు మెచ్చుకొని, నీచిత్రలేఖన మత్యంతరామణీయకముగ నున్నది. కాని, తొడమీఁద నల్లగా మచ్చనై చితివేమి ? యని యడిగెను. దేవిగారి కక్కడ పుట్టుమచ్చ యున్నదనియు, దానిగుర్తుకై యచ్చట నొకమచ్చ పెట్టితిననియుఁ జిత్రకారుఁడు చెప్పెను. అక్కడ పుట్టుమచ్చయున్నట్లు నీ వెట్లెఱింగితి వని రా జడిగెను. కాళిదాసుఁడు చెప్పెనని జరిగినసంగతంతయు నతండు రాజుతోఁ జెప్పెను.

వెంటనే రాజన్యుఁడు కాళిదాసుని జీరి, 'యామె కచ్చోట పుట్టుమచ్చ యుండుట నీకెట్లు దెలిసె'నని యడిగెను అంతఁ గవి రాజోత్తమా ! పద్మినీజాతిస్త్రీల కుత్సంగతలమున పుట్టుమచ్చ యుండుట లక్షణమై యున్నది. అతండు తిలకము దిద్దునపు డది జారిపోవుటయు, జిత్రలేఖకుఁడు నన్నడుగుటచేతను గ్రహించి చెప్పితిని. తరువాత దేవరచిత్తము. అని యూరకుండెను. రాజేంద్రుఁడు కాళిదాసుయం దనుమానము గలవాఁడై నీవు నేటినుండి నారాజ్యమునం దుండఁదగదు. తక్షణము వెడలిపొమ్మని చెప్పెను. వెంటనే కాళిదాసుఁడు సభామందిరము విడిచి, వేశ్యాగృహంబును జేరి, యచ్చోటనే రహస్యముగ గాలము గడుపుచుండెను.

---

## కాళిదాసుని యకాలమరణము.

కాళిదాసుఁ డంతఃపురద్రోహి యని వెడలనడపిన గొన్నిదినంబులకు రాజన్యుఁడు నిర్దోషియగు కవిచంద్రునియందు, మరల ననురాగము గలవాఁడై, తనబుద్ధిమాంద్యమునకు మనంబున బశ్చాత్తాప మొంది చారులను నానాదేశములకు బంపి వానికొఱకై వెదకించెను. కాని, వానిజాడయే తెలియలేదు. కాళిదాసుఁడు వేశ్యాగృహంబుననే డాఁగి యున్నాఁడని కొందఱును, పగలు పురబాహ్యప్రదేశముల డాఁగియుండి రాత్రులయందావేశ్యాగృహంబున నుండునని కొందఱును పలుతెఱఁగుల వక్కాణించిరి. రాజునకువానిపోకడ యేమాత్రముఁ దెలియకపోవుటచే, నతండు దప్పక కణ్యాంగనయింటనేరహస్యముగనుండియుండుననితలంచి, సపరివారముగ దానిమందిరమునకుఁ బోయి కాళిదాసుఁ డెక్కడున్నాఁడని రాజు దానిం బ్రశ్నించెను. “మహారాజా! నా కాసుహాత్మునిజాడయే దెలియ”దని గణికాఁగన ప్రత్యుత్తర మొసంగెను. రాజన్యుఁడు దానిమాటలయందు నమ్మకము లేనివాఁడై తనమనంబున నిట్లు తలంచెను. “కాళిదాసుఁ డీవెలయాలియం దధికానురాగము గలవాఁడు. ఒక క్షణమేనియు నొకరినొక రెడబాసి యుండరు. అతఁడు రహస్యముగ నిక్కడకు వచ్చి, పోవుచుండుట నిజము. కావున, నీగోడమీఁద నొక యర్ధశ్లోకమును వ్రాసి పోయెదను. అతఁ డదిచూచినచోఁ దప్పక బూర్తి చేయఁగలఁడు. నాభావార్ధమున కనుగుణ్యముగ నతఁడు దప్ప మఱెవ్వఁ డీశ్లోకమును బూరింపలేడు. ఇదియే మంచి యుపాయ”మని తలంచి, యాశ్లోకార్ధమును వేశ్యమంచముప్రక్కనున్న గోడమీఁద నీక్రిందివిధముగ వ్రాసెను.

శ్లో॥ “కుసుమే కుసుమోత్పత్తి శ్శ్రూయతే నచ దృశ్యతే॥”

తా. పువ్వునందుఁ బువ్వుబుట్టుట వినలేదు. కనలేదు.

అని లిఖించి, యీసమస్యఁ బూరించినవానికి నారాజ్యము నర్ధభాగ మిచ్చెద ననిక్రూడ దానిక్రిందవ్రాసి, వెడలిపోయెను.

భోజరాజు తలంచినట్లే కాళిదాసుఁ డర్ధరాత్రంబున వేశ్యాగృహంబును రహస్యముగఁ బ్రవేశించి, రాజేంద్రుఁడు వచ్చి పోయిన యీవృత్తాంతము దానివల్ల నెఱింగి, మరల వానికి పశ్చాత్తాపంబుఁ గలిగినందులకు సంతసించి, యనంతర మాసమస్య నీక్రిందివిధముగఁ బూరించెను.

"బాలే తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయం"

తా. ఓ బాలా! నీముఖమనెడు తామరపువ్వునందు కలువపూవులజంట కనుపించుచున్నవి. అనగాఁ బువ్వులోఁ బువ్వుపుట్టుట లోకవిరుద్ధమైనను, యిప్పటికాలమున కది కనిపించుచున్నది. ఎట్లనఁగా, నీముఖమనెడు తామరపూవునందుఁ గన్నులనెడు రెండునల్లకలువపూవులు వికసించినవి. అని భావము.

"బాలే" యనుమాట, విలాసవతియందు గలప్రేమాతిశయమునఁ గాళిదాసుఁ డట్లు వర్ణించెను. విలాసవతి యాశ్లోకమును వినఁగానే దురాశాపీడితురాలయ్యెను. కాళిదాసుఁ డీసమస్యను బూరించినాఁడని తెలిసినచో నర్ధరాజ్యము వానికే దక్కును. కావున, కాళిదాసును చంపివైచి, యీసమస్యను పూరించితినని రాజుతోఁ జెప్పి, యర్ధరాజ్యమును తానే సంగ్రహింపవలె నని తనమనంబున నిశ్చయించుకొనెను. ఆహా! చూచితిరకదా! తన్ను నధికానురాగముతోఁ జూచుచు, సంపాదించిన ధనధాన్యరాసులన్నియు దానికే యొసంగుచు, సర్వము దానే యని భావించుచు, నిజభార్యకంటె నెక్కుడుగ నాదరించి పోషించి సుఖింపఁజేయుచున్న కాళిదాసుని విలాసవతియగు వేశ్యారత్నము విషోరగమై, పాపభీతి లేక గఱచి చంపచున్నదిగదా! అయ్యో! కవిచంద్రుఁడును, బ్రాహ్మణోత్తముఁడును, కాళీప్రసాదవర్ధితుఁడును, లోకోత్తరప్రభావుఁడును, భోజమహారాజునకు బరమమిత్రుండు నగుకాళిదాసుఁడు గాఢనిద్రాముద్రితుఁడై యుండ, నాపిశాచియగు విలాసవతి, గుప్తఖడ్గ

ముతో వానికంఠమును జీల్చివైచెను పిమ్మట 'బాలే' యనుమాట, దీసివైచి, రాజును సంబోధించినట్లుగా 'రాజన్' అనుటకుబదులు 'రాజే' యనుమాట జేర్చి, తిరిగి యాశ్లోకమును భూర్జరపత్రముమీఁద వ్రాసికొని సంతసించెను.

మరునాఁడుదయమున విలాసవతి కాళిదాసుని శవమున్నగదికి బదిలముగ దాళము వైచి, యాశ్లోకమును జేతఁగొని, రాజాస్థానమునకు బోయి, మహారాజును దర్శించి, రాజేంద్రా! దేవరవా రిచ్చినశ్లోకమును నేను పూరించితిని. చిత్తగింపుఁడని, యాశ్లోకమును జదివెను. అశ్లోకభావార్థము రాజన్యున కనుమానము గలుగఁజేయ తనమనంబున నిట్లని వితర్కించుకొనఁదొడఁగెను. "ఉపమానము, సరసపదప్రయోగము నా కాళిదాసువే యని స్ఫురించుచున్నది. ఇంతరసపుష్టిగ సమస్యను బూరించువాఁ డీలోకమున లేదు. ఈపణ్యాంగన కింతటిప్రజ్ఞ యెక్కడిది? ఇట్టి లలితపదప్రయోగము మహాకవులు గాని ప్రయోగింపఁజాలరు. కాని, కాళిదాసుఁడే యైనపక్షమున లక్షణయుక్తముగ 'రాజన్' అని ప్రయోగింపవలసినపదమునకు 'రాజే' యను తప్పుడుపద మేల నుపయోగించను? ఇది తప్పక కాళిదాసువిరచితమే యైనను దీనిలో నేదో మోసమున్నదనుట నిజము. ఈవేశ్య రాజ్యకాంక్షాపరురాలై, కాళిదాసు నెటులో వంచించి శ్లోకము సంగ్రహించి, యిట్టియపశబ్ద మిదియే నందు జేర్చి యుండవలయు" నని గ్రహించి, వేశ్యను జూచి, "ఓసీ! ఇది నీకవిత్వము గాదు. కాళిదాసుని రచన యని స్పష్టీకరింపఁబడుచున్నది. కాళిదాసుఁ డెక్కడున్నాడు? వాని కేదేని ద్రోహము గావించి యీశ్లోకము సంగ్రహించితివా? లేక వానిసమ్మతిమీఁద నే గొనివచ్చితివా? నిజము వక్కాణింపుము. లేదేని నిన్నిదే చంపించెదఁ జూడు" మని మేఘగంభీరస్వనముతోఁ బలుక, నావేశ్య గడగడవడఁకుచు, సాక్షాత్తు యమధర్మరాజువలెఁ జూపట్టుచున్న రాజుపాదంబులపైఁ బడి యేడ్చుచు, మహా

రాజా! రాజ్యాపేక్షచే, గాళిదాసును నేనే జంపివైచితిని. 'బాలే' యని యతండు రచించెను. నే నది దీసివైచి 'రాజే' అని చెప్పితిని. సర్వనాశనము గావించితిని. నావంటిపాపాత్ముఁ రాలీజగంబున లేదు. ఇంక నన్ను మీచిత్తానుసారముగ శిక్షింపుఁడు." అని గొల్లున నేడ్వసాగెను.

శ్రవణపుటంబులు వ్రక్కలించిన దానిమాటలు వినినంతనే "మహారాజు, 'హా' యని యఱచి సింహాసనముమీఁదనే మూర్ఛిల్లెను. సభాబృందమంతయు నెలుగెత్తి యేడ్చెను. పరిచారకుల శీతలోపచారములచేఁ గొలదిసేపటికి రాజు మూర్ఛనుండి లేచి, "హా! పండితచక్రవర్తీ! హా మదాజ్ఞానువర్తీ! హా జగద్విఖ్యాతకీర్తీ! హా నిరాడంబరమూర్తీ! హా భువనేశ్వరీచరణకమలసేవానురక్తీ! నీ కప్పుడే నూరేండ్లు నిండెనా? నీవంటి పరమమిత్రుని గోల్పోయిన యీయభాగ్యున కీలోక మెందుకు? రాజ్యసర్వస్వ మెందుకు? ఇఁక నేనుఁ గూడ నీతోఁ జనుదెంచెద. నేఁటితో సరస్వతి నిరాధార మైనది. కవితాకన్య యనాథ యైనది. పాండిత్యము భగ్నమైనది. సమస్యలు చల్లానవి. కవితారసప్రవాహిని యింకిపోయినది. నేఁడు కవిచంద్రుఁ డస్తమించుటచే జగమంతయు నంధకారబంధురమైపోయినది." అనిపలువిధముల దుఃఖింపుచుఁ బూర్వజన్మవృత్తాంతము స్ఫురింపఁగాఁ గాళిదాసుఁడు పోయినయేడుగడియలకే తనకు మరణమున్నదని తెలిసికొని, సలయుసన్నాహముల కాజ్ఞ యొసంగెను.

---

భోజరాజు నిర్యాణము.

కాళిదాసునితోఁ బాటు భోజమహారాజుగూడ దేహత్యాగముఁ జేయుచున్నాఁడని తెలియుటతోడనే పట్టణమంతటను హాహాకారములు చెలరేగెను. భోజమహారాజు పరిపాలనమునఁ బ్రజ లెట్టి యిక్కట్టులకు లోనుగాక, ధనకనకవస్తువాహనాదులు గలిగి సుఖించుచున్నారు. అందువలనఁ బ్రజలందఱు దమకాప్తబంధుమిత్రు లెవరో చచ్చియున్నట్లుగా

గొల్లున నేడ్వసాగిరి. అంతఃపుర మంతయు రోదనధ్వనులతో మిన్ను ముట్టుచుండెను. మంత్రిసామంతాది విద్వత్కవిబృందమంతయు మహాదుఃఖ భరితులైరి.

అంత రాజాజ్ఞచే మంచిగంధపుకఱ్ఱలతో నొకచితి యమర్పంబడెను. అగ్నిహోత్రునకు బ్రీతికరమగు నేతికడవలుగూడ సిద్ధము చేయంబడెను. అప్పుడు రాజేంద్రుండు 'రాజ్యాంతే నరకం ధ్రువ'మ్మను నార్యోక్తి జ్ఞప్తికి దెచ్చుకొని సకలపాపౌఘనివృత్తికొఱకును, మోక్షప్రాప్తికొఱకును, 'రామకథాసుధారస' మనుపేర ప్రబంధ మొండు, యాశుకవిత్వముగా చంపూరామాయణము రచించి, యేడుగడియలలో సుందరకాండము ముగించెను. అప్పటికి తనకికగడువు లేదని వెంటనే పోయి చితి నారోహించెను. ఉత్తరక్షణమందే లీలావతీదేవియు భర్తతో సహగమనముం జేయంగలంచి పసుపుబట్టలతోం జనుదెంచి చితిపై భర్తప్రక్కనే కుండుకొనియెను. వెంటనే చితి రగులుకొనెను. సతీపతు లిరువురు నిండు ప్రాణములతోం గిన్నుకనుండ నగ్నిదేవున కాహుతులైరి. అట్టి యుత్తమ సతీపతుల సహగమనభాగ్యమున కగ్నిదేవుండు తనకీలకాజ్వాల లాకసంబంటునట్లు విజృంభించి, పరిచారికలు పోయునేతిని గనుపార ద్రాగుచు స్వల్పకాలములో దంపతులను భస్మీపటలము గావింపంజేసెను.

భోజకాళిదాసులు గతించినను, వారియశోవిరాజితకీర్తిచంద్రుండు మాత్ర మిట్లే చంద్రతారార్కశరధిస్థాయిగ వెలుంగునుగాక.

సంపూర్ణము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B108 |
| పుస్తకం పేరు | మహాకవి కాళిదాసుచరిత్రము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | K.Naveen |
| పేజీలు విడదీసినది | K.Naveen |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |